# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక"— ఫెవీ ఫెయిరీ



"ఇంద్రజాలం కానే కాదిది
చేత్తోచేసే తమాషా యిది
డబ్బాతోనూ పనియే లేదు
దీనికి యిక మరి తిరుగేలేదు."
"ఏమిటిదంతా యిటొచ్చి చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."
"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపోండర్రా
ఆలోచించి అంటించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బుట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
పట్టుకోకనే పట్టుకునేదిది
మురికి కానిది ముచ్చటైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మలైనా చేసెయ్యింక"



ఏస్టర్ పూలు ఎలా తయారుచెయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటం కోసం ఈ కూపన్ పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి: "ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020.

ఏస్టర్ పూలు ఎలా తయారుచెయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటంకోసం ఈ కూపన్ ను ఈ చిరునామాకు పంపించండి : "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.




## ఫెవికాల్ ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్

**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది. ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**

గుర్తుండే ఉంటాయి మీకు మీ అమ్మ చెప్పిన అనుభవాలు. అప్పటి ఆడవాళ్లు ఆ అయిదు రోజులూ ఎలా గడిపేవారో, ఎలా ఆ పాతకాలపు బట్ట మడతల మీద భారం వేయవల్సి వచ్చేదో....అయితే ఇప్పుడు రోజులు మారాయి. ఈనాటి శ్రీ సరైన శానిటరీ నేప్కిన్-అంటే కేర్‌ఫ్రీ లాంటిది వాడిందంటే ఏ పని కావాలంటే ఆ పని హాయిగా చేసుకోవచ్చు. కేర్‌ఫ్రీ ఎందుకు అంటారా!

మరి కాలం మారుతోంది అలాగే మీరూనూ.

ఈనాటి మీ ప్రపంచానికీ మీ అమ్మ చిన్ననాటి ప్రపంచానికీ ఎంతో తేడా ఉంది. మీరు ఆ అయిదు రోజులూ ఇంట్లో ఖైదీలా కూర్చో పీల్లేదు. ఏదో ఇబ్బందిగా ఉన్నట్టు అనుకో పీల్లేదు. అందుకే సరైన శానిటరీ నేప్కిన్ ఎంచుకుని రక్షణ పొందడం అంత ముఖ్యం.



మారుతున్న ఈ కాలానికి కేర్‌ఫ్రీ ఎలా మంచిది!

ఎందుకంటే కేర్‌ఫ్రీ ఆరోగ్య రీత్యా ఎంతో పరిశుద్ధమైనదిగా ఉండి మీకు పూర్తి రక్షణనిస్తుంది.



కేర్‌ఫ్రీలో చెమ్మ బాగా పీల్చుకునే పొరలున్నాయి. వీటి మూలంగా మీకు ఏమాత్రం చెమ్మ అనిపించకుండా సదా హాయిగా ఉంటుంది. ఋతుస్రావం ఎక్కువగా ఉన్న రోజులకోసం కేర్‌ఫ్రీ ఎక్స్‌ట్రా లార్జ్ ఉంది. మరింత పొడవు, వెడల్పు, దళసరితనమూ గల ఈ నేప్కిన్ మీరు కోరినప్పుడల్లా మరింత రక్షణ, మరింత ఆత్మవిశ్వాసం ఇస్తుంది.

కేర్‌ఫ్రీలోని మూడు ప్రక్కల ప్లాస్టిషీల్డ్ ధర్మమా అని కారడం, మరకలు పడడం జరగనే జరగదు. అంటే ఇకమీద సిగ్గుతెచ్చే ప్రమాదాలేవీ జరగవన్నమాట! అందుకే ఆ అయిదు రోజులూ కూడా నెలలో మిగతా రోజులలాగే అనిపిస్తుంది. మరి మీరింకా మామూలు నేప్కిన్‌లే వాడుతూ ఉంటే, కేర్‌ఫ్రీకి మారిపోవలసిన సమయం వచ్చినట్టు లేదూ! ఎందుకేమిటి! మారుతున్న కాలంతో బాటే మీరూ మారవద్దూ!

కేర్‌ఫ్రీ శానిటరీ నేప్కిన్స్—మారుతున్న ఈ కాలానికి పూర్తి హాయి, పూర్తి రక్షణ.




# కేర్‌ఫ్రీ. ఎందుకంటే కాలం మారుతోంది. అలాగే మీరూనూ.

జాన్సన్ అండ్ జాన్సన్

OBM/9074/TEL/R




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["ప్రజలమనిషి"]కి ఆధారం, జొన్నలగడ్డ రత్న రచన. మనిషికి ఆసక్తితోపాటు, పట్టుదల తోడయితే, ఏ విద్యనైనా సాధించవచ్చు. అయితే, ఏదో ఒక విద్యలో ప్రవీణుడైనవాడు, మిగతా విద్యల్లో, అతి సామాన్యుల్లో ఒకడుగా వుండిపోతాడు. కాని, వస్తుతః వివేకం, విచక్షణాజ్ఞానం వున్నవాడు, ఏ సమస్యకైనా యిట్టే పరిష్కారమార్గం చెప్పి, పదిమంది చేతా గౌరవింపబడతాడు. ''గోపీనాథుడి అంచనా'' అన్న కథ, ఇందుకు ఉదాహరణ.

## అమరవాణి

యః సముత్పతితం క్రోధం, క్షమయైవ నిరస్యతి,
యథోరగస్త్వచం జీర్ణం, స వై పురుష ఉచ్యతే.

[తన పాతబడిన కుబుసాన్ని, కష్టపడి పాము విడిచిపెట్టే విధంగా, మనిషి ఆత్మనిగ్రహంతో, ఓర్పుతో కోపాన్ని వదిలివేయాలి.]

సంపుటి 80 మే '87 సంచిక 5

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00

CHITRA



# Mighty as the sword!



## Make your mark...with
# APOLLO PENCILS

The space age pencils with
super bonded lead, that doesn't break
Available with attractive printed designs







**APOLLO PENCILS PVT LTD.,**
107, Regal Industrial Estate,
Acharya Donde Marg, Sewree (West),
Bombay 400 015. Ph: 4133295/4133215

---

*Distributors* : GREATER BOMBAY : **D. Jagjivandas & Company,** 177, Abdul Rehman Street, Bombay 400 003. Ph : 326524 MAHARASHTRA : **A. Aalok & Company,** 107, Regal Industrial Estate, Acharya Donde Marg, Sewree (West), Bombay 400 015. Ph : 4133295/4133215 GUJARAT : **N. Chimanlal & Co.** 'Jesmin' Building, Near Firdaus Flats, Khanpur, Ahmedabad 380 001. Ph : 395198/399570 DELHI HARYANA PUNJAB J.K. & HIMACHAL PRADESH : **Bharati Traders,** 89, Chawri Bazar, Delhi 110 006. Ph : 262854 KARNATAKA ANDHRA PRADESH & GOA : **Sanghvi Corporation,** Suresh Bldg., No. 17, 4th Cross, Kalasipalayam, New Extension, Bangalore 560 002. Ph : 225702 CALCUTTA & WEST BENGAL : **Sanghvi Corporation,** 14/1/1A, Jackson Lane, 2nd Floor, Calcutta-700 001. Ph : 262141 UTTAR PRADESH : **Sanghvi Corporation,** 7 A, Balmiki Marg, Kaisar Bagh, Lucknow (U.P.) Ph : 35095 TAMIL NADU : **Sanghvi Corporation,** Bafna Complex, 1st Floor, 35, Strotten Muthia Mudaliar Street, Madras-600 079. Ph : 22304 REST OF INDIA : **Sanghvi Corporation,** 107, Regal Industrial Estate, Acharya Donde Marg, Sewree (West), Bombay 400 015. Ph : 4133295/4133215

3 Brothers/APL/887

# భృగుమహర్షి

త్రిమూర్తులయిన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో సత్వగుణ ప్రధానుడు ఎవరు? అన్న సందేహం ఒకానొకప్పుడు మునులకు కలిగింది. మునులు బ్రహ్మమానస పుత్రుడయిన భృగుమహర్షి వద్దకువెళ్ళి, తమ సందేహాన్ని వ్యక్తం చేశారు. మునుల సందేహాన్ని తీర్చడానికి, భృగువు త్రిమూర్తుల దర్శనానికి బయలుదేరాడు.

మొదట ఆయన బ్రహ్మలోకానికి వెళ్ళాడు. సరస్వతి వీణవాయిస్తూ ఉండగా, బ్రహ్మ కళ్ళు మూసుకుని సృష్టి కార్యంలో నిమగ్నుడై ఉండి, భృగువు రాకను గమనించలేదు. భృగువు ఆగ్రహం చెంది బ్రహ్మను శపించి కైలాసానికి వెళ్ళాడు. అక్కడ శివపార్వతులు నృత్యంలో లీనమై భృగువు రాకను ఏమాత్రం పట్టించుకోలేదు. మహర్షి క్రోధావేశంతో శివుణ్ణి శపించి వైకుంఠానికి పయనమయ్యాడు.

వైకుంఠంలో విష్ణువు శేషశయనంమీద పవళించి, యోగనిద్రలో ఉన్నాడు. తనవంటి గొప్ప భక్తుడు వచ్చినా పట్టించుకోకుండా, కర్తవ్యాన్ని మరచి నిద్రపోతున్నాడన్న ఆగ్రహంతో, భృగువు విష్ణువు వక్షస్థలంపై తన్నాడు.

వెంటనే విష్ణువు మేల్కాంచి, "మహర్షీ, కఠినమైన నా వక్షాన్ని తాకడంవల్ల, మృదువైన తమ పాదం కందిపోలేదుకదా!" అంటూ వెళ్ళి మునిపాదాలు పట్టుకుని ఒత్తసాగాడు!

తన తొందరపాటుకు భృగువు ఎంతగానో బాధపడి, విష్ణువుకు క్షమాపణలు చెప్పుకున్నారు. విష్ణువు మందహాసంతో, తన వక్షంలో ఎల్లప్పుడూ భృగుపాద చిహ్నంగా శ్రీవత్సం ఉంటుందని, భృగువుకు వరమిచ్చారు. భక్తుడిపట్ల భగవంతుడి అవ్యాజానురాగానికి సంకేతం అది!

భృగువు పరమానందంతో మునులవద్దకు పోయి, త్రిమూర్తులలో మహావిష్ణువే సత్వగుణ ప్రధానుడనీ, భక్తుల పాలిటి కల్పవృక్షమనీ వాళ్ళకు తెలియజేశాడు.





# గోపీనాధుడి అంచనా

ఉమాశంకరు డనే ఆయన గొప్ప కవి. అయితే, ఆయన తన కవిత్వాన్ని ధన సంపాదనకు ఉపయోగించలేదు. పెద్ద లిచ్చిన ఆస్తితోనే, ఆయన తన నలుగురు పిల్లల్ని, పెంచి పెద్దవాళ్ళను చేశాడు. భార్య పార్వతి కూడా, ఎంతో పొదుపరి కావడంవల్ల, ఆయన డబ్బు గురించి ఏనాడూ యిబ్బంది పడలేదు.

ఇప్పుడు, ఉమాశంకరుడి పెద్ద కొడుకు, న్యాయాధికారికి ప్రధాన సలహా దారుగా వుంటున్నాడు. న్యాయశాస్త్రంలో, అతడికి తెలియని మెలుకువలు లేవని అందరూ చెప్పుకుంటారు. పెద్దకూతురు లక్ష్మికీ, రెండో కూతురు రమకూ కూడా, వివాహాలైపోయాయి. అల్లుళ్ళిద్దరూ అన్న దమ్ములు. ఇద్దరూ కూడా ఆ ఊళ్ళోనే వ్యాపారం చేసుకుంటూ ఉచ్ఛస్థితిలో వున్నారు.

ఉమాశంకరుడి పిల్లలందరిలోకీ చిన్న వాడు, గోపీనాధుడు. వాడు బాగా చదువు కున్నప్పటికీ, ప్రత్యేకించి ఏ విద్యలోనూ ప్రావీణ్యత లేదు.

ఒక పర్యాయం, రాజసభలో, ఇద్దరు నర్తకీమణుల మధ్య పోటీ జరిగినప్పుడు, వారిలో ఎవరు గొప్పో తేల్చడం, మహా విద్వాంసులకే సాధ్యపడలేదు. అప్పుడు, జనం మధ్యలోంచి, గోపీనాధుడు ముందుకువచ్చి, ''నర్తకీమణుల గొప్ప తనాన్ని అంచనా వేయడం వల్ల, వారికి మాత్రమే న్యాయం చేకూరుతుంది. వారిరువురికీ, తగురీతిగా కానుకలిస్తే, నాట్య కళకు న్యాయం కలుగుతుంది. నర్తకీ మణులకు న్యాయం జరగడంలో, ఆలస్యం అయినా నష్టం లేదు. నాట్యకళకు మాత్రం, వెంటనే న్యాయం జరిగేలా చూడండి!'' అని మహారాజును కోరాడు.

శ్రీ రామకమల్



చెడ్డలను మాత్రం, నా విచక్షతో పరిశీలించి చెప్పగలను,'' అన్నాడు.

రాజు అందుకు అంగీకరించాడు. అచిరకాలంలోనే, గోపీనాధుడికి, మనుషుల శక్తిసామర్థ్యాలను అంచనా వేయడంలో, సాటి ఎవరూ లేరని పేరు వచ్చింది. ఈ పేరు నిలబెట్టుకోవడం కోసం, గోపీనాధుడు తానెక్కడ వున్నప్పటికీ, మనుషులను అంచనా కట్టడం, ఒక అలవాటుగా మార్చుకున్నాడు.

ఒక పర్యాయం, అతడు కూరల సంతలో వుండగా, ఒకడు ఎక్కువ ధరకు, మరొకడు తక్కువ ధరకు వంకాయ లమ్ముతున్నారు. ఆ సమయంలో, గోపీనాధుడి పక్కన వున్న స్నేహితు డొకడు, ''ఈ యిద్దరిలో, నువ్వెవరిని మెచ్చుకుంటావు ?'' అని అడిగాడు.

''తక్కువ ధరకు అమ్మేవాడిని !'' అన్నాడు గోపీనాధుడు తడుముకోకుండా.

''మరి, వాడమ్మే కాయల్లో, నాల్గింట, మూడు వంతులు పుచ్చులు. ఎవరికైనా, ఎక్కువ ధర వాడి దగ్గిర కొంటేనే లాభం. ఎందుకంటే, వాడి దగ్గిర కాయలన్నీ మంచివి,'' అన్నాడు గోపీనాధుడి స్నేహితుడు.

''అవుననుకో ! కాని, వాళ్ళిద్దరూ వ్యాపారంలో అపారంగా డబ్బు సంపా

రాజుకు, గోపీనాధుడి మాటలు నచ్చాయి. ఆయన ఆలస్యం చేయకుండా నర్తకీమణులిద్దరికీ విలువైన కానుకలిచ్చి, వారి గొప్పతనాన్ని నిర్ణయించే భారం, నిపుణులకు వదిలిపెట్టాడు.

ఆ తర్వాత ఆయన, గోపీనాధుణ్ణి పిలిచి, ''నీ విచక్షణాజ్ఞానం మెచ్చదగింది. ఈ రోజు నుంచి, నా అంతరంగిక సలహాదారుగా వుండ గోరుతున్నాను,'' అన్నాడు.

దానికి గోపీనాధుడు వినయంగా, ''ప్రభూ, తమకు సలహాలివ్వగలిగినంత, అనుభవం, నాకు లేదు. తమకు సమర్థులైన వాళ్ళిచ్చే సలహాలలోని, మంచి,

యించాలనుకుంటున్నారు. అందుకు, ప్రజలనాకర్షించే పద్ధతి తెలియాలి. ప్రజల్లో, నాణ్యతకంటే, ధరకే ప్రాధాన్యత నిచ్చేవాళ్ళెక్కువ, అన్న విషయం గ్రహించి, ఎక్కువ సంపాదించినవాడే— వీళ్ళిద్దరిలో మెచ్చదగినవాడు," అన్నాడు గోపీనాధుడు.

స్నేహితుడు, గోపీనాధుణ్ణి ఎంతగానో అభినందించడమేకాక, ఈ విషయం గోపీనాధుడి ఇంట్లో చెప్పి, "ఎప్పుడెవరిని గురించి అడిగినా, ఇట్టే అంచనా వేసి చెప్పగలగడంలో, గోపీనాధుడు తనకు తానే సాటి," అన్నాడు.

అప్పుడు ఉమాశంకరుడి ఇంట్లో, అల్లుళ్ళిద్దరూ, కూతుళ్ళతో సహా వచ్చి వున్నారు. మర్నాడే పండగ కావడం వల్ల, ఇల్లంతా సందడిగా వున్నది.

గోపీనాధుడి అక్క రమ, వాడితో, "అందరి శక్తిసామర్థ్యాలూ అంచనా వేసి చెప్పడం కాదు; నువ్వు మన ఇంట్లోవాళ్ళ గురించి చెప్పగలగాలి," అన్నది.

"దానికేముంది, తప్పకుండా చెబుతాను," అన్నాడు గోపీనాధుడు.

ముందు వాడు; బావగార్లిద్దరి గొప్పతనాన్నీ మెచ్చుకున్నాడు. ఎందుకంటే— సాధారణంగా తల్లిదండ్రులు, బాగా సంపాయిస్తున్న వ్యాపారులైతే, పిల్లలు చదువుకోకుండా అల్లరిచిల్లరిగా తిరిగి చెడిపోతారు. గోపీనాధుడి బావలిద్దరూ కూడా చక్కగా చదువుకున్నారు.





తర్వాతవాడు, అన్నగారితో, "న్యాయాధికారికి సలహాలివ్వడం, కత్తి మీద సాము వంటిది. న్యాయం సక్రమంగా జరిగితే, అది న్యాయాధికారి గొప్పతనం అవుతుంది. అలా కానప్పుడు, అది సలహాదారుడి తప్పంటారు. అంటే, సలహాదారుకెప్పుడూ మంచిపేరు రాదు—కానీ నీకు వచ్చింది. ఇది నీ గొప్పతనం!'' అన్నాడు.

పెద్దక్క లక్ష్మి గురించి చెబుతూ, ''చిన్నప్పుడు, ఒకపక్క వంటపనుల్లో అమ్మకు సాయం చేస్తూ, మరోపక్క దారంతో బట్టల మీద బొమ్మలు కుట్టడం, చాపలల్లడం వంటి ప్రయోజనకరమైన పనులెన్నో నేర్చుకున్నది. అవి నేర్చుకునేందుకు తీరుబడి చేసుకోవడమే, ఆ వయసులో పెద్ద విశేషం!'' అని చెప్పాడు.

''మరి, నా సంగతి చెప్పు!'' అని అడిగింది, వాడి చిన్నక్క రమ.

''నువు సంగీతం నేర్చుకోవడమే, ఒక గొప్ప విశేషం!'' అన్నాడు గోపీనాథుడు.

''అదేంకాదు. నాకు సంగీతం అంత బాగా రాలేదు. నువ్వు, నన్ను వెటకారం చేస్తున్నావు.'' అన్నది రమ చిన్నబుచ్చుకుంటూ.

గోపీనాథుడు చిన్నగా నవ్వి, ''విశేషమెందుక్కాదు! నువ్వు, గండోదరశాస్త్రి దగ్గిర సంగీతం నేర్చుకుని కూడా, ఆ మాత్రం పాడగలుగుతున్నావంటే—అది పెద్ద విశేషమే కదా!'' అన్నాడు.

అందరూ ఘొల్లుమంటూ నవ్వారు.

గండోదరశాస్త్రి గొప్ప సంగీత విద్వాంసుడే కాని, తన వద్ద చేరిన శిష్యులనాయన, అనేక విధాల కంగారుపెట్టి, వచ్చినది కూడా మరిచిపోయేలా చేస్తాడని, అందరూ చెప్పుకుంటారు.

ఆ తర్వాత, గోపీనాథుడు యిలా చెప్పాడు: ''ఇక అమ్మ సంగతి! ఆమె పిల్లలందర్నీ పెంచి పెద్దచేసి—ఇంత వాళ్ళను చేసిన ఘనత, పూర్తిగా అమ్మది. నాన్నగారెన్నడూ ధనసంపాదన గురించి ఆలోచించకపోయినా అభ్యంతరం చెప్పక,

ఉన్నంతలోనే పొదుపుగా సంసారాన్ని ఈడ్చుకు వచ్చింది.''

గోపీనాధుడి తల్లి పార్వతి సిగ్గుపడుతూ, ''అయితే, మీ నాన్నగారిని గురించి కూడా చెప్పు!'' అని అడిగింది.

ఉమాశంకరుడు, తనను గురించి కొడుకేమంటాడో అని, కుతూహలంగా ఎదురుచూశాడు.

అయితే, గోపీనాధుడు, ''ఈ ఇంట్లో, ఎవరి గురించీ యిక చెప్పను,'' అనేశాడు.

ఉమాశంకరుడు చివాలున అక్కడి నుంచి లేచి, గది బయటకు వెళ్ళిపోయాడు. అయన మనసు బాగా లేదని గ్రహించిన పార్వతి, అయన వెనకగా వెళ్ళింది.

''ఏమిటిలా మధ్యలో లేచి వచ్చారు?'' అని అడిగిందామె భర్తను.

అందుకాయన, ''నేను అన్ని విధాలా అసమర్థుణ్ణి. పెద్దలు ఆస్తి యిచ్చారు; దానితోనే, పిల్లలు పెద్దవాళ్ళయేదాకా గడిచింది. పిల్లల బాగోగులన్నీ నువ్వు చూశావు. ఇప్పుడు నా దగ్గిర ఏమీ లేదు. సంసారం పిల్లల సంపాదనతో గడుస్తున్నది. నేనెవరికన్నా సాయం చేయాలన్నా, పిల్లల సాయం కోరాలి. పిల్లలు నన్ను గౌరవించేందుకు, నేను చేసిందేమీ లేదని, ఈ రోజే నాకర్థమైంది,'' అన్నాడు.

ఆ జవాబు విన్న పార్వతి మనస్సు చివుక్కుమన్నది. అమె భర్తతో, ''వాడేదో సరదాగా అన్న మాటలను, మీరిలా అర్థం



చేసుకున్నారా? ఇలా మీరు మధ్యలో వచ్చేస్తే, అంతా ఏమనుకుంటారు?'' అని భర్తకు సర్దిచెప్పి, తిరిగి ఆయనతో గది వైపుకు దారితీసింది.

అయితే, వాళ్ళిద్దరూ గదిలోకి వెళ్ళకుండా గుమ్మం దగ్గిరే ఆగిపోయారు. ఆ సమయంలో గోపీనాధుడు, అందరికీ తండ్రిని గురించి చెప్పబోతూ, వాడి అన్నయ్యను ఉద్దేశించి, "అన్నయ్యా, మీరు చేస్తున్న పనులన్నిటిలోనూ, ఎంతో కొంత నాకు ప్రవేశమున్నది. అందువల్లనే, మీ అందరినీ అంచనా వేయగల సాహసం చేశాను. కాని, అది నాన్నగారి విషయంలో, ఎలా సాధ్యపడుతుంది? ఆయన మహానుభావుడు. ఆయన కవిత్వం, నాకర్థం కాదు. తను కష్టపడుతూ కూడా, యితరులకు సాయపడే, ఆయన దానగుణం, నాకర్థం కాదు. తన కవిత్వాన్ని, ధన సంపాదనకుపయోగించకూడదనే, ఆయన అలౌకికతత్వం, నాకర్థం కాదు. ఆయన గొప్పతనాన్ని అర్థం చేసుకునేందుకు ప్రయత్నిస్తూ, ఈ మాత్రం తెలివి సంపాయించాను. ఊహల్లో కూడా ఆయన మంచి, చెడ్డలనెంచాలని ప్రయత్నించలేదు. అలాంటప్పుడు, నేనాయన నెలా అంచనా వేయగలను?'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఈ మాటలు విన్న ఉమాశంకరుడు, చప్పున గదిలోకి పోయి, గోపీనాధుణ్ణి కౌగలించుకుని, "నా గొప్పతనమంటూ వుంటే, అది నీ వంటి కొడుకును పొందడంలోనే వున్నది!'' అన్నాడు ఎంతో ఆనందంగా.

గోపీనాధుడు, తండ్రి పాదాలంటి, "ఏ తనయుడూ, తన తండ్రిని అంచనా వేయలేడు. నా అన్నలు, అక్కలు, తల్లి—అందరూ, మీరున్నారన్న ధైర్యంతోనే, తమ తమ పనులు సక్రమంగా నిర్వర్తించారు,'' అన్నాడు.

ఉమాశంకరుడు, తన సంతానంతో మరిన్ని సంవత్సరాలు చాలా హాయిగా జీవించాడు.





# హారానికి వజ్రం

గోవర్ధనగిరి మహారాజు కిశోరవర్మ, తన కుమార్తె మనోరమను, హిమపురి యువ రాజు జయసేనుడి కిచ్చి వివాహం చేయ నిశ్చయించాడు. రాజపురోహితుడు వివాహానికి ముహూర్తం కూడా నిర్ణయించాడు.

వివాహసమయంలో రాకుమార్తె ధరించేందుకు, కిశోరవర్మ ఒక అందమైన హారాన్ని తయారు చేయించాడు కాని, హారం మధ్యలో వేయవలసిన మంచి వజ్రం ఆయనకు లభ్యం కాలేదు.

ఎంతోమంది వజ్రాల వర్తకులు, విలువైన వజ్రాల నెన్నిటినో మనోరమకు చూపించారు. ఆమెకు వాటిల్లో ఒక్కటి కూడా నచ్చలేదు. ఆ పరిస్థితిలో, కాంచనపురం, చందనపురం, వరుణపురాల నుంచి—ధనగుప్తుడు, చంద్రచూడుడు, నాగదత్తుడు అనే ముగ్గురు వర్తకులు, తమ వద్ద వున్న వజ్రాలను చూపవచ్చారు.

ధనగుప్తుడు ముందుగా మనోరమను దర్శించి, తాను తెచ్చిన వజ్రాలను ఒక పళ్ళెంలో పోశాడు. మనోరమ వాటిని కొంతసేపు పరీక్షించి చూసి, "అన్ని ఎంతో బావున్నాయి. కాని, వీటిల్లో దేన్ని నా హారం కోసం తీసుకోవాలో తెలియడం లేదు," అన్నది.

వెంటనే ధనగుప్తుడు పళ్ళెంలోంచి, ఒక వజ్రాన్ని తీసి, "ఇది తమ హారానికి చాలా బావుంటుంది," అన్నాడు.

మనోరమ కోపంగా, "వజ్రాన్ని ఎన్నిక చేయవలసింది నేను; నువ్వుకాదు!" అంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

తర్వాత చంద్రచూడుడు వచ్చి, తన వద్ద వున్న వజ్రాలను పళ్ళెంలో పోశాడు. వాటిని చూస్తూనే మనోరమ, "ఆహా, అద్భుతం! వజ్రాలన్నీ, ఒకదాన్ని మించి మరొకటి అందాలు చిమ్ముతున్నాయి.

రాంబాబు

నా హారానికి ఏది ఎన్నుకోవాలో తెలియక అయోమయంగా వున్నది,'' అన్నది.

చంద్రచూడుడు, ఒక వజ్రాన్ని పళ్ళెం లోంచి తీసి, ''ఇదే, యువరాణిగారి హారానికి సరితూగే వజ్రం,'' అన్నాడు.

మనోరమ యీసారి మరింత కోపంగా, ''వజ్రాన్ని ఎన్నిక చేయవలసింది నేను గాని, నువ్వు కాదు. ఇక వెళ్ళు,'' అన్నది.

ఆ తర్వాత నాగదత్తుడు వచ్చి, ''యువ రాణిగారి కోసం, ఒక అద్భుతమైన వజ్రాన్ని తెచ్చాను. అదేదో గుర్తించి, వారే స్వయంగా ఎన్నుకుంటారు,'' అంటూ వజ్రాలను పళ్ళెంలో గుమ్మరించాడు.

మనోరమ వజ్రాలను కొంతసేపు పరీక్షగా చూసి, వాటిల్లో నుంచి ఒకదాన్ని తీసుకుని, ''ఇదే, నా హారానికి తగిన వజ్రం!'' అని, నాగదత్తుడికి వజ్రం ఖరీదుతో పాటు, సరి అయిన వజ్రం తెచ్చినందుకు బహుమానం కూడా యిప్పించింది.

నాగదత్తుడు రాజభవనం నుంచి బయిటికి రాగానే, ధనగుప్తుడు, చంద్రచూడుడు, అతణ్ణి ''ఎంతో విలువైన వజ్రాలను తెచ్చి కూడా, మేము రాకుమార్తెను తృప్తిపరచలేక పోయాము. నీ వద్ద, ఆమె వెంటనే వజ్రాన్ని ఎన్నుకోవడంలో వున్న రహస్యం ఏమిటి?'' అని అడిగారు.

అందుకు నాగదత్తుడు, ''మీరు, రాకుమారికి అన్నీ విలువైన వజ్రాలు చూపించారు. అందువల్ల, ఆమె వాటిల్లో నుంచి, తనకు కావలసినదాన్ని ఎన్నిక చేయలేకపోయింది,'' అన్నాడు.

''ఆ మాట నిజమే అనిపిస్తున్నది. మరి, నువ్వు ఎలాంటి పథకం వేసి, వజ్రాన్ని అమ్మగలిగావు?'' అని అడిగారు వర్తకులిద్దరూ.

ఆ ప్రశ్నకు నాగదత్తుడు నవ్వి, ''పెద్ద పథకం అంటూ ఏమీ లేదు. నేను, ఒకే ఒక అందమైన వజ్రాన్ని తీసుకుని, దానిని అంతగా విలువలేని వజ్రాలతో కలిపి, పళ్ళెంలో వుంచాను. రాకుమారి, ఆ అందమైన వజ్రాన్ని, తన హారానికి ఎన్నిక చేయడంక్షణం కూడాపట్టలేదు,"అన్నాడు.






## 13

[చిత్రసేనుడు రాజ్యంలో తల ఎత్తిన బందిపోట్లనూ, దారిదోపిడిగాళ్ళనూ ఎంతో చాకచక్యంతో లొంగతీసుకున్నాడు. ఈలోపల రాణి కాంతిమతి కుమారుణ్ణి కన్నది. వాడికి ఐదేళ్ళు నిండగానే ఉగ్రాక్షుడు వచ్చాడు. చిత్రసేనుడు అతడికి ఒక బాలుణ్ణి యిచ్చాడు. ఆ బాలుడు రాకుమారుడు కాదని ఉగ్రాక్షుడు తెలుసుకున్నాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు కోటద్వారం దగ్గరకు రావటం చూస్తూనే అమరపాలుడు, చిత్రసేనుడి వద్దకు పోయి, ''మహారాజా! ఆ రాక్షసుడు భూమి దద్దరిల్లేలా అడుగులు వేస్తూ, కోటలోకి వస్తున్నాడు,'' అని చెప్పాడు.

చిత్రసేనుడు నివ్వెరపోయాడు. రాణి కాంతిమతి వెలవెలపోయింది. ''అయితే, ఆ కుర్రవాడెవడైందీ ఉగ్రాక్షుడు గ్రహించాడన్నమాట!'' అన్నాడు చిత్రసేనుడు.

''వాణ్ణి మనం అంత సులభంగా మోసగించలేం, మహారాజా!'' అన్నాడు అమరపాలుడు.

''అలాగే తోస్తున్నది,'' అంటూ చిత్రసేనుడు కాంతిమతి కేసి ఓ క్షణకాలం చూసి, ''మనం విచారించి లాభం లేదు. నేను అతడికి వాగ్దానం చేసినప్పుడు పరిస్థితులు యీ విధంగా పరిణమిస్తవని వూహించలేకపోయాను,'' అన్నాడు.



వింటూనే చిత్రసేనుడూ, అమరపాలుడూ మేడమెట్లు దిగి కిందికి వచ్చారు. చిత్రసేనుడు ఉగ్రాక్షుడి కేసి చిరునవ్వు నవ్వుతూ, "ఏం జరిగింది ఉగ్రాక్షా?" అన్నాడు.

"మోసం మహారాజా! మీరీ విధంగా ఆడితప్పుతారని నేననుకోలేదు." అన్నాడు ఉగ్రాక్షుడు భుజం మీది నుంచి కుర్రవాణ్ణి కిందకు దింపుతూ.

"దాసీలవల్ల పొరపాటు జరిగిపోయింది. వాళ్ళు హడావిడిలో నీకు రాజకుమారుడి బదులు మంత్రి కుమారుణ్ణి యిచ్చారు," అన్నాడు అమరపాలుడు.

"వాణ్ణి హతమార్చిస్తేనో, మహారాజా?" అన్నాడు అమరపాలుడు.

"అది అంత తేలిగ్గా సాధ్యమయేది కాదు. ఒకవేళ సాధ్యం అయినా, రాజ్యం అల్లకల్లోలం కావటం, నేను మాట తప్పాననే అపకీర్తి పొందటం జరిగి తీరుతుంది," అన్నాడు చిత్రసేనుడు.

రాణి కాంతిమతి చప్పున ఆసనం మీది నుంచి లేచి, "మహారాజా! ఆ రాక్షసుడి సంగతి నాకు వదలండి," అంటూ తన గది కేసి వెళ్ళిపోయింది.

ఇంతలో ఉగ్రాక్షుడు రాజప్రాసాదం సమీపించి, "మహారాజా, మహారాజా!" అంటూ గావుకేకలు పెట్టాడు. ఆ కేకలు

"వీడు మంత్రికుమారుడా? అహ్హహ్హ," అంటూ ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, కుర్రవాణ్ణి రెండు చేతులతో పట్టి పైకెత్తుతూ, "వీడు వంటవాడి కొడుకు, మంత్రి కుమారుడు కాదు. అసలు నాకు కావలసింది చిత్రసేన మహారాజుగారి మొదటి సంతానం. దానికి బదులు ఈ రాజ్యమంతా నా కిస్తానన్నా తీసుకోను," అన్నాడు.

"కొంచెం ఆగు. కుర్రవాడికి మంచి దుస్తులు తొడిగి యిప్పుడే తీసుకువస్తారు," అన్నాడు చిత్రసేనుడు.

క్షణాల మీద దాసీలు చక్కని పట్టు దుస్తులతో అలంకరించిన ఒక కుర్రవాణ్ణి తెచ్చి, ఉగ్రాక్షుడి ముందు నిలబెట్టారు.




ఉగ్రాక్షుడు ఆ కుర్రవాడి కేసీ, దాసీల కేసీ ఒకటి రెండుసార్లు పరీక్షగా చూసి, దాసీలతో, ''అమ్మాయిలూ, మీరు హడావిడిలో రాజకుమారుడికి మరెవరినైనా తీసుకురాలేదుగదా?'' అని అడిగాడు.

''నీకు అంత అనుమానం అయితే అబ్బాయినే అడుగు,'' అన్నారు దాసీలు. ఈలోపల చిత్రసేనుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి సమీపించి, వాణ్ణి చేతుల్లోకి తీసుకుంటూ, ''నీ పేరేమిటి బాబూ?'' అని అడిగాడు.

''యువరాజు,'' అన్నాడు కుర్రవాడు.

దాసీలు పెద్దగా నవ్వుతూ, ''అదేం ప్రశ్న ఉగ్రాక్షా? 'నీ వెవరి కొడుకువు?' అని కుర్రవాణ్ణి ప్రశ్నిస్తే నిజం బయట పడేదిగదా?'' అన్నారు.

''నన్ను మోసం చేయదలుచుకుంటే, అలాంటి ప్రశ్నకు వీడు ఎలాంటి జవాబివ్వాలో ముందుగానే మీరు నేర్పి వుంటారు. అందుకనే నేను మరోరకం ప్రశ్న అడిగాను. వీడు రాజకుమారుడవునో కాదో తెలుసుకునేందుకు, అడవిలో వీడికొక పరీక్ష వున్నది. ఈసారి కూడా మీరు నన్ను మోసం చేసినట్టు బయటపడిందో, మీ దాసీ లందర్నీ ఎత్తుకుపోయి, నా బంట్లకు యిచ్చి పెళ్ళి చేసేస్తాను,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడు అన్న మాటలు విని కొందరు దాసీలు నవ్వుకున్నారు, కొందరు భయపడ్డారు. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజాన ఎక్కించుకుని వేగంగా అడుగులు వేసుకుంటూ అడవిలో ప్రవేశించాడు.

ఉగ్రాక్షుడు అడవిలో కొంతదూరం నడిచిన తరవాత, కుర్రవాణ్ణి రాజకుమారుడవునో కాదో పరీక్ష చెయ్యాలనుకున్నాడు. అతడికి దారిమధ్య వంటవాడి కొడుకు జారవిడిచిన కర్రపుల్ల కనబడింది. ఉగ్రాక్షుడు కుర్రవాణ్ణి భుజం మీది నుంచి దించి, కర్రపుల్లను అతడి చేతికి అందిస్తూ, ''ఈ కర్రపుల్ల నీకిస్తే, ఏం చేస్తావురా, బాబూ?'' అని ప్రశ్నించాడు.



డని నా కిస్తారా!'' అంటూ ఉగ్రాక్షుడు కళ్ళెర్రచేసి, కుర్రవాణ్ణి భుజాన వేసుకుని, హుంకరిస్తూ కపిలపురం కోటకు బయలు దేరాడు.

ఉగ్రాక్షుడు అడవిదాటి కోటముందున్న మైదానం కేసి చూసేసరికి అక్కడ కొందరు గుర్రపు రౌతులూ, సైనికులూ నిలబడి వున్నారు. వాళ్ళను చూస్తూనే ఉగ్రాక్షుడు, ''వీళ్ళందర్నీ చిత్రసేనుడు నా మీద యుద్ధానికి పంపలేదుగద,'' అనుకున్నాడు. కాని, అతడు వాళ్ళను సమీపిస్తున్నకొద్దీ అతడికి రాజభటుల ముందు నిలబడిన అమరపాలుడూ, అతడి పక్కన పట్టువస్త్రాలు ధరించి ధగధగ మెరిసిపోతున్న ఒక ఐదేళ్ళ కుర్రవాడూ కనిపించారు. ''వీడు, రాజ కుమారుడయి వుంటాడు,'' అనుకున్నాడు ఉగ్రాక్షుడు తృప్తిగా.

''ఇది నాకెందుకు? మా అయ్యి కిస్తాను,'' అన్నాడు కుర్రవాడు. ఉగ్రాక్షుడు ఉలిక్కిపడ్డాడు. మళ్ళీ తనను మోస గించి వుంటారన్న అనుమానం అతడికి కలిగింది.

''మీ అయ్య ఈ కర్రతో ఏం చేస్తాడు?'' అని అడిగాడు అతడు.

''మంద విడిచి ఏదన్నా గొర్రె పారి పోవాలని చూస్తే, ఈ కర్రతో దాని కాళ్లు విరగేస్తాడు,'' అన్నాడు కుర్రవాడు.

''అరె కుంభకర్ణుడా! నువ్వు రాజు గారి గొర్రెలు కాచేవాడి కొడుకువన్న మాట! ఎంత మోసం, ఎంత మోసం! గొర్రెలు కాచేవాడి కొడుకును, రాజకుమారు

ఉగ్రాక్షుడు అల్లంత దూరంలో వుండ గానే అమరపాలుడు పెద్దగా కేకపెట్టి, ''ఉగ్రాక్షా! ఇడుగో రాజకుమారుడు. రెండవసారి కూడా దాసీలవల్లనే పొర పాటు జరిగిపోయింది. ఏమీ అనుకోకు,'' అన్నాడు.

''ఈ పొరబాట్లన్నీ దాసీలు చేస్తున్నవా?'' అంటూ ఉగ్రాక్షుడు హేళనగా నవ్వి, ''అయితే, నువ్వు ఈసారి పొరబాటుపడి

ఎవరబ్బాయిని యివ్వబోతున్నావు?'' అని అడిగాడు.

''ఈ కుర్రవాడు ఎవరో కాదు, యువరాజు. చిత్రసేన మహారాజు ప్రథమ సంతానం!'' అన్నాడు అమరపాలుడు కోపంగా.

ఉగ్రాక్షుడు ఆ కుర్రవాణ్ణి పరీక్షగా చూసి, వీడు తప్పక రాజకుమారుడే అని దృఢపరుచుకుని, ''నన్నింత ఆయాస పెట్టి, మీరింత ఆయాసపడేకన్న— మొదటిసారిగానే యువరాజును నాకిస్తే సరిపోయేదిగదా?'' అన్నాడు.




''నువ్వు రాక్షసుడివి గనక కన్న కడుపు తీపి ఎలా వుంటుందో నీకు తెలియదు. రాణి మూర్ఛపోయింది. మహారాజు దుఃఖంతో తన గదిలో పడుకుని వున్నాడు. ఆయన ముందూ వెనకలు ఆలోచించకుండా నీకు చేసిన వాగ్దానం, ఈనాడు ఎంత విచారకారణం అయిందో నీకు తెలియదు. సరే, నువ్వు వచ్చిన పని అయిందిగదా?" అన్నాడు అమరపాలుడు.

''అవునవును,'' అంటూ ఉగ్రాక్షుడు బిక్క మొహం వేసి, రాజకుమారుణ్ణి భుజం మీదికి ఎత్తుకుంటూ, ''ఏదో ఒక నాడు వచ్చి మహారాజుగారి దర్శనం చేసుకుంటాను,'' అంటూ అడవికేసి బయలు దేరాడు.

''ఇక మీదట రాజకుమారుడికి ఎటువంటి కష్టం కలగకుండా చూస్తూ, పెంచి పెద్దవాణ్ణి చేసే భారం నీది, జాగ్రత్త!'' అంటూ అమరపాలుడు వెనక నుంచి కేక వేశాడు.

ఉగ్రాక్షుడు ఆ కేక వింటూనే నడుస్తున్నవాడల్లా ఆగి, వెనుదిరిగి, ''ఈనాటి నుంచి వీడు చిత్రసేన మహారాజు కుమారుడు కాదు, నా కుమారుడు— ఉగ్రదత్తుడు! తెలిసిందా?'' అంటూ హుంకరించాడు.

ఉప్పొంగుతున్న ఉత్సాహంతో ఉగ్రాక్షుడు అరణ్యానికి అడ్డంపడి తన కోట కేసి నడుస్తూ, భుజం మీద వున్న రాజ



రాకుమారుడితో, ''బాబూ, ఇవాళటి నుంచి నువ్వు నా కుమారుడివి. నీ పేరు ఉగ్రదత్తుడు. ఈ అడవి అంతా నీదే. నీకు సేవ చెయ్యటానికీ, నీ ఆజ్ఞల్ని పాలించేందుకూ వందలకొలది బంట్లు మన కోటలో వున్నారు,'' అన్నాడు.

ఉగ్రాక్షుడు తన కోటను సమీపించాడు. కోటముందు తమ తమ కుటుంబాలతో రాక్షసబంట్లు సోలుపులుగా నిలబడి వున్నారు. వాళ్ళు ఉగ్రాక్షుణ్ణీ, రాకుమారుణ్ణీ చూస్తూనే జయజయ ధ్వానాలు చేశారు.

ఉగ్రాక్షుడు తన సేవకులకు రాకుమారుణ్ణి చూపుతూ, ''వీడు మీ కాబోయే నాయకుడు, పేరు ఉగ్రదత్తుడు!'' అన్నాడు. వెంటనే 'ఉగ్రదత్తుడికీ జై!' అన్న కేకలు వినిపించినై. ఉగ్రాక్షుడు కోటలో ప్రవేశించి, అక్కడ చక్కగా అలంకరించిన ఒక గదిలో ఉగ్రదత్తుణ్ణి భుజంమీదినుంచిదింపుతూ, "ఉగ్రదత్తా, ఈ గది నీది. నీతో కలిసి ఆడుకునేందుకు నీ వయసువాళ్ళే అయిన యిద్దరు బాలుర్ని తెప్పిస్తాను,'' అన్నాడు.

ఉగ్రాక్షుడు తన బంట్లలో ముఖ్యులైన వారిని నలుగురిని పిలిచి, ''మీరు యిప్పుడే బయలుదేరి వెళ్ళి, ఉగ్రదత్తుడి వయసు వాళ్ళయిన యిద్దరు మగపిల్లల్ని పట్టుకు రండి. ఇది కొంత రహస్యంగా జరగాలి. మనం పల్లెల మీద పడి పిల్లల్ని అపహరిస్తున్నట్టు చిత్రసేన మహారాజుకు తెలియకూడదు,'' అన్నాడు.

''అయితే, ఈ పని రాత్రివేళ జరగటమే మంచిది,'' అన్నాడొక బంటు.

''అలాగే చెయ్యండి. కాని, చీకట్లో తెలియక ఏ గుడ్డివాళ్ళనో, కుంటివాళ్ళనో పట్టుకునివస్తే మాత్రం మీ చర్మాలు వొలుస్తాను. ఇదుగో, మీరు పిల్లల్ని దొంగిలించిన ఇంట్లో ఈ బంగారు కాసుల సంచులు వదిలి రండి,'' అంటూ ఉగ్రాక్షుడు తన బంట్లకు బంగారం వున్న రెండు సంచులు ఇచ్చాడు.

కొద్ది రోజులు గడిచినై. ఒకనాటి ఉదయం ఉగ్రాక్షుడు ఉగ్రదత్తుణ్ణి కోట ముందున్న ఆవరణలో ఆడిస్తూ వుండగా నలుగురు రాక్షసబంట్లు పాటలు పాడుతూ, ఈలలు వేస్తూ అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. వాళ్ళ చేతుల్లో ఉగ్రదత్తుడి వయసువాళ్ళే అయిన యిద్దరు కుర్ర వాళ్ళున్నారు.

వాళ్ళను చూస్తూనే ఉగ్రదత్తుడు ఉత్సాహంగా గంతులు వేయసాగాడు. కాని, ఆ కుర్రవాళ్ళిద్దరూ భయంతో బిక్కు బిక్కు మంటున్నారు. ఉగ్రాక్షుడు తన బంట్లతో, "ఎవరికీ తెలియకుండా రహస్యంగానే ఈ ఇద్దర్నీ పట్టుకొచ్చారా?" అని అడిగాడు.

"పరాయి కంటికి తెలీదు, మహా నాయకా, ఇద్దర్నీ ఊరిబయట చెరువుగట్టు నున్న ఇళ్ళల్లో నుంచి పట్టుకొచ్చాం. ఆ సమయంలో పెద్దవాళ్ళెవరూ లేరు. మీరిచ్చిన బంగారు కాసుల సంచులు ఇళ్ళల్లో వదిలాం," అన్నారు రాక్షస బంట్లు.

ఇంతలో కొత్తగా పట్టుకొచ్చిన కుర్ర వాళ్ళిద్దరూ ఒక్కసారిగా గొంతులెత్తి ఏడవ సాగారు. వాళ్ళిద్దరిని చూసి ఉగ్రదత్తుడు కూడా కెవ్వుమని ఏడుపు ప్రారంభించాడు.

ఉగ్రాక్షుడు ముగ్గుర్నీ సముదాయిం చేందుకు ప్రయత్నిస్తూ తన బంట్లతో, "వీళ్ళను తోటలోకి తీసుకుపోయి ఆడిం చండి. అక్కడ వున్న పులిపిల్లల్నీ, ఎలుగు కూనల్నీ చూస్తే ఏడుపు మానొచ్చు. వీళ్ళు ముగ్గురూ పెరిగి పెద్దవాళ్ళయ్యేవరకూ, వీళ్ళను గురించిన సమాచారం అడవిలో వున్న గ్రామవాసు లెవరికీ తెలియ కూడదు," అన్నాడు.

వెంటనే రాక్షసబంట్లు కోట వెనక వున్న తోటలోకి ముగ్గురు బాలుర్నీ తీసుకు పోయారు. అక్కడ పులి, ఎలుగుబంటి మొదలైన క్రూరమృగాల పిల్లలు చెట్లకింద ఆడుకుంటున్నవి. వాటిని చూస్తూనే ఉగ్ర దత్తుడూ, తతిమ్మా యిద్దరు కుర్రవాళ్ళూ ఏడుపు మానారు. —(ఇంకావుంది)






# ప్రజలమనిషి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రి వేళ హాయిగా హంసతూలికా తల్పంమీద నిద్రించవలసిన నువ్వు, ఏ కారణంవల్ల, ఈ భీతిగొల్పే శ్మశానంలో తిరుగుతున్నావో, నాకర్థం కావడంలేదు., రాజు లలితాదిత్యుడిలాగా, నువ్వూ ఏ శత్రువు వల్లనో, ప్రజలలో అప్రతిష్ఠపాలై యిక్కడికి రాలేదు గద! రాజైనవాడు, అన్ని వేళలా వివేకీ, పౌరుషశాలీ అయి వుండాలి. ఎంతటి గడ్డు పరిస్థితులలో నైనా, వాటిని ఒక్కక్షణ కాలం కూడా కోల్పోరాదు. అలాకానినాడు, అతడు రాజనిపించుకో లేడు. ఇందుకు ఉదాహరణగా, రాజు లలితాదిత్యుడి కథ

## బేతాళ కథలు



చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

లక్షణ దేశాన్ని పాలించే లలితాదిత్యుడికి, తన జన్మదినంనాడు, రాజ్యంలోని ప్రజలలో ఎక్కువమంది అభిమానించే వ్యక్తికి, ఘనమైన సన్మానం చేయాలన్న ఆలోచన కలిగింది. అటువంటి వ్యక్తి ఎవరో తెలుసుకురమ్మని, ఆయనచారులను రాజ్యం నలుమూలలకూ పంపాడు.

చారులు, ఒకనెల రోజులపాటు రాజ్యమంతా తిరిగివచ్చి, లలితాదిత్యుడితో, ప్రజలు ఎక్కువగా అభిమానించే వ్యక్తి, గజదొంగ గంగన్న అని తెలియబరిచారు.

అందుకు లలితాదిత్యుడు, ఆశ్చర్యపడి, మంత్రి కమలేశ్వరుడితో, ''గంగన్న హత్యలూ, దోపిడీలూ చేస్తున్న సంగతి, అందరూ ఎరిగినదే! వాడిని సజీవంగా పట్టి తెచ్చినవారికిగానీ, అది సాధ్యం కానప్పుడు, తల నరికి తెచ్చినవారికిగానీ, లక్ష వరహాలు బహూకరించగలమని ప్రకటన చేశాం,'' అన్నాడు.

''అవును, మహారాజా! అయినా వాడింతవరకూ పట్టుబడలేదు,'' అన్నాడు మంత్రి.

''దానికి కారణం, వాడికి ప్రజల సహకారం వుండడమే అని తెలుస్తున్నది. రాజు శిక్షించదలచిన ఒక గజదొంగకు, ప్రజలు రక్షణ యిస్తూ అభిమానించడం, ఒక విధమైన రాజద్రోహమే అవుతుంది గదా!'' అన్నాడు లలితాదిత్యుడు.

మంత్రి కొద్దిసేపు ఆలోచించి, ''మనం, ఆ దొంగను అభిమానించే ప్రజలెవరో, అందుకు గల కారణాలేమిటో, ముందు తెలుసుకోవడం అవసరం. అలాకాక, ప్రజలను శిక్షించడం ప్రారంభిస్తే, వ్యవహారం రచ్చకెక్కి, రాజ్యంలోనేకాక, సాటి రాజుల్లో కూడా అవమానానికి గురి కావలసివస్తుంది,'' అన్నాడు.

ఆ తర్వాత, మంత్రి సలహామీద, గజదొంగ గంగన్నకు, ప్రజలలో వచ్చిన

పలుకుబడికి కారణాలేమిటో తెలుసు కునేందుకు, రాజు ఆయనతో కలిసి మారు వేషంలో బయలుదేరాడు.

వాళ్ళిద్దరూ, రాజ్యంలో ఎన్నో ప్రాంతాలు తిరుగుతూ, గంగన్నను గురించి ప్రజలను ప్రశ్నించసాగారు. అయితే, ప్రతిఒక్కడూ, గంగన్న దేవుడిలాంటి మనిషి అనడం తప్ప, వాడిని గురించిన వివరాలుగానీ, ఆచూకీగాని యివ్వలేదు.

ఒకనాడు రాజూ, మంత్రీ ఒక గ్రామం లోని సత్రంలో బసచేసి వుండగా, వారికి లోకనాధుడనే యువకుడితో పరిచయం అయింది. వాళ్ళు, అతడితో తాము పరదేశస్థులమని చెప్పి, "మీ రాజుగారు, గంగన్న అనే గజదొంగను పట్టి యిచ్చిన వారికి, లక్ష వరహాలిస్తామని చేసిన ప్రకటన సంగతి విన్నాం. వాడిని పట్టుకుని ఆ లక్షవరహాల బహుమానం పొందాలన్న పట్టుదలతో, యీ రాజ్యానికి వచ్చాం. కాని, ఎవరినడిగినా, వాడు దేవుడిలాంటి మనిషి అంటున్నారు. యిదేమి వింత!" అన్నారు.

దానికి లోకనాధుడు పెద్దగా నవ్వి, "ఆ గంగన్నకు ప్రజలలో వున్న గౌరవం తెలిసి కూడా, యింకా మీ పట్టుదల మానలేదంటే, నిజంగానే మీరు పరదేశీయుల్లా కనబడుతున్నారు!" అన్నాడు.



ఈ జవాబు విని లలితాదిత్యుడు కోపంగా, "ఒక గజదొంగకు ఆశ్రయం యిస్తూ, అతడు గొప్పవాడని చెప్పడాన్ని బట్టే, ఈ దేశప్రజలు నైతికంగా పతనావస్థలో వున్నారని తెలుస్తున్నది. మీ రాజు ధర్మబుద్ధి గలవాడు గనక సరిపోయింది; ఈ ధోరణి మరే దేశంలోనయినా రాజద్రోహంగా ఎంచబడుతుంది," అన్నాడు.

లోకనాధుడు, రాజు ముఖంలోకి సూటిగా చూస్తూ, "ఈ దేశపు రాజుతో పోల్చినప్పుడు, గంగన్న ఏమాత్రం దొంగ కానేకాడు," అన్నాడు.

అందుకు రాజు మరింతకోపంగా ఏదో అనబోతుండగా, మంత్రి అతడికి కనుసైగ



చేశాడు. ఆయనకు, యీ లోకనాధుడి నుంచి, గంగన్నను గురించిన సమాచారం రాబట్టవచ్చునన్న నమ్మకం కలిగింది.

''క్షమించండి! గంగన్నపట్ల ప్రజల కున్న అభిమానం తెలుసుకుని కూడా, కొంత పరుషంగా మాట్లాడాం. కాని, మమ్మల్ని ఒక సంశయం వేధిస్తున్నది. గంగన్న దొంగ కాదనీ, రాజుకన్న మంచి వాడనీ, ప్రజలు ఎందుకనుకుంటున్నారో అర్థం కావడంలేదు. రాజు పన్నులు విధించడం, ప్రజల్ని దోచుకోవడం లాటి దన్న అభిప్రాయం కూడా వారికి వుండడం, చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది,'' అన్నాడు మంత్రి.

లోకనాధుడు కొద్ది క్షణాలు మౌనంగా వూరుకుని, ''వాస్తవం ఏమిటో చెప్ప మంటారా? ఈ దేశపు రాజు, బీదా, గొప్పా అన్న జ్ఞానం లేకుండా, ప్రజలందరినుంచీ బలవంతంగా పన్నులు వసూలు చేస్తాడు. అందులో ఒక్కవంతైనా, వాళ్ళ సౌకర్యాల కోసం ఖర్చుపెట్టడు. గంగన్న అలా కాదు. అన్యాయంగా ధనం సంపాయించే వాళ్ళనూ, అవినీతిపరుల్నీ మాత్రమే దోచుకుంటాడు. అలా దోచిన ధనాన్ని, పేదసాదలకు పంచిపెడతాడు. అతడి చలవవల్ల, ఎన్నో కుటుంబాలకు నిలవ నీడ దొరికింది. అతణ్ణి దేవుడనుకోవడంలో వింత ఏమీలేదు,'' అన్నాడు.

మంత్రి చిరునవ్వు నవ్వి, ''మీరు చెప్పింది, ఒక విధంగా బాగానే వున్నది. అయితే, పన్నులు విధించడం, వసూలు చేయడం, ఆ ధనాన్ని ఎలా ఖర్చుచేయాలో నిర్ణయించవలసింది, రాజేకదా! అలాం టప్పుడు, యీ గంగన్న మధ్య కల్పించు కుని, అరాజకం సృష్టించడం చూస్తూంటే, అతడేదో ఒకనాడు సింహాసనాన్ని చేజిక్కించుకోవాలన్న ఆశతో వున్నాడన్న అనుమానం కలుగుతున్నది,'' అన్నాడు.

ఆ మాటలు వింటూనే లోకనాధుడు, అడ్డంగా తలాడించి, ''గంగన్నకు అలాంటి దురుద్దేశం లేనేలేదు. దేశం అవసరాలకు

మించిన అధిక పన్నులు, దోపిడీతో సమానం. యుద్ధభయం లేకపోయినా, రాజు ఒక లక్షమంది సైనికులను పోషిస్తున్నాడు. ఈమధ్య ఆయన ఎంతో సొమ్ము వెచ్చించి, తన ఆస్థాన నర్తకికి, ఒక సుందర భవనం నిర్మింపజేశాడు. తన కోసం వేసవికొకటీ, శీతాకాలానికొకటీ పెద్ద ప్రాసాదాలు కట్టించుకున్నాడు. ఇదంతా ప్రజల నుంచి పన్నుల రూపంగా వసూలు చేసిన ధనం వృధా చేయడమే అవుతుంది. ఇందువల్లనే, రాజు ప్రజలకు దొంగగానూ, గంగన్న ప్రజలమనిషిగానూ కనబడుతున్నారు!" అన్నాడు.



రాజు తలవంచుకుని, కొంత సేపు ఆలోచిస్తూ ఊరుకుని, తర్వాత లోకనాధుడితో, "మీరు, గంగన్నను గురించి మాకు తెలియని ఎన్నో విశేషాలు తెలియజేశారు. అతణ్ణి పట్టుకుని, రాజునుంచి బహుమానం సంపాయించాలనుకున్నందుకు విచారిస్తున్నాం," అని, మంత్రితో బయలుదేరి రాజధానీ నగరం చేరాడు.

మరుసటి రోజున మంత్రి కమలేశ్వరుడు, రాజు లలితాదిత్యుణ్ణి దర్శించి, "మహారాజా, నిన్న మనతో సత్రంలో అంత సేపు మాట్లాడిన లోకనాధుడు మరెవరో కాదు; గజదొంగ గంగన్న! ఆ సంగతి గ్రహించి కూడా, తమకు తెలియపరచడం మేలా, కీడా అన్న సంశయంలో పడి ఊరుకున్నాను. క్షమించాలి," అన్నాడు.

లలితాదిత్యుడు, మంత్రి అన్నదానికి చిన్నగా నవ్వి," లోకనాధుడే, గజదొంగ గంగన్న అని, నేనూ గ్రహించాను," అన్నాడు.

తర్వాత ఆయన, అత్యంత సమర్థులైన చారులద్వారా, ప్రజలను యిక్కట్లపాలు చేసే అవినీతిపరులైన రాజోద్యోగులూ, పెడమార్గాల ధనార్జన చేసే వర్తకులూ ఎవరైనదీ తెలుసుకుని, వాళ్ళనుకఠినంగా శిక్షించాడు. తర్వాత తనకున్న అర్థబలం, అంగబలాలను సమీకరించి, ప్రజలకు అవసరం అయిన సదుపాయాలు ఎప్పటి

కప్పుడు సమకూరుస్తూ, కొద్ది కాలంలోనే ధర్మప్రభువన్న కీర్తిగడించాడు.

ఆ తర్వాత, ఎంతోకాలం ప్రజల మనిషిగా చెలామణీ అయిన గజదొంగ గంగన్న ఏమైనదీ ఎవరికీ తెలియదు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రాజ్యంలో తనను అప్రతిష్ఠపాలు చేస్తున్న గజదొంగ ఒంటరిగా దొరికినప్పుడు, లలితాదిత్యుడు, అతణ్ణి ఎందుకు బంధించలేదు? ఇది—అతడు పౌరుషహీనుడూ, అవివేకీ అని తెలియజేస్తున్నదిగదా. ముందు గజదొంగను కొరతవేయించి, తర్వాత ప్రజలకు మేలు కలిగే పనులు చేయవచ్చు. లలితాదిత్యుడు అలా ఎందుకు చేయలేదు? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తనను గురించి గజదొంగ గంగన్న అన్న మాటల ద్వారా, రాజు లలితాదిత్యుడికి, ప్రజలలో తానెంత అప్రతిష్ఠపాలైనదీ తెలిసివచ్చింది. అయితే, తన పరిపాలన తీరు గురించి, గంగన్న చెప్పినది వాస్తవం అని ఒప్పుకుని, అతణ్ణి క్షమించడంగాని, సన్మానించడంగాని చేస్తే, ప్రజలలో అతడి పలుకుబడి మరింతగా పెరుగుతుంది. ఒకవేళ బంధించి కొరత వేయించినా, గంగన్నకు ప్రజలలో వున్న గౌరవం, పలుకుబడీకారణంగా, వాళ్ళు దేశంలో అరాజకం సృష్టించవచ్చు. ఇదంతా ఆలోచించే లలితాదిత్యుడు, తనకున్న అర్థ, అంగబలాల ద్వారా, గంగన్న కన్న ఎన్నోరెట్లు ప్రజలకు మేలు కలిగించాడు. అందువల్ల, ప్రజలు క్రమంగా గంగన్న సంగతే మరిచిపోయారు. ఈ కారణాలన్నింటివల్లా, లలితాదిత్యుడు పౌరుషహీనుడూ, అవివేకీకాదనీ, ఎంతో రాజచతురత వున్నవాడనీ తెలుస్తున్నది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# మౌనభంగం

స్రవంతీ రాజ్యాన్నేలే కళ్యాణవర్మకు, ఒక చక్కని కుమార్తె వున్నది. ఆమె పేరు శోభ. అందచందాల్లోనే కాక, తెలివితేటల్లో కూడా, ఆమెకు, ఆమే సాటి. ఆమెను తమ కోడలుగా చేసుకోదలచి, ఎందరో రాజులు, కళ్యాణవర్మకు వర్తమానాలు పంపారు. అయితే, కళ్యాణవర్మ, ముందుగా కుమార్తె అభిప్రాయం తెలుసుకోదలిచాడు.

ఆయన ఒకనాడు, శోభను, ''నీకెలాంటి వరుడు కావాలో చెప్పమ్మా ?'' అని అడిగాడు.

అందుకు శోభ, ''నన్ను వివాహ మాడదలచినవాడికి, అపారమైన తెలివితేటలతో పాటు, తిరుగులేని సాహసం కూడా వుండాలి,'' అన్నది.

''బావుంది. కాని, ఆ సంగతి తెలుసుకునేందుకు, ఏదైనా ఉపాయం ఆలోచించావా ?'' అని ప్రశ్నించాడు కళ్యాణవర్మ కుమార్తెను.

''ఇందుకు తగిన ఉపాయం వున్నది, నాన్నా. నేను మౌనవ్రతం అవలంబిస్తాను. తన తెలివితేటలతో దాన్ని భంగపరిచి, నాతో మాట్లాడగలిగిన సాహసవంతుణ్ణే, నేను వివాహమాడతాను,'' అన్నది శోభ చిన్నగా నవ్వుతూ.

కళ్యాణవర్మ, కుమార్తె చెప్పినదానికి తృప్తిపడి, ఆమె కోరిన విధంగా రాజ్యంలో చాటింపు వేయించాడు.

యువరాణి మౌనవ్రతాన్ని భంగపరిచి, ఆమెను వివాహమాడాలని ఎందరో వచ్చి, తాము భంగపడి తిరిగి వెళ్ళిపోసాగారు.

ఇలాంటి సమయంలో, సుమంతపురపు యువరాజు ఆనందవర్ధనుడు దేశయాత్రలు చేస్తూ, స్రవంతీపురానికి వచ్చి, శోభ గురించి విన్నాడు. ఆమె అందం గురించీ,

“ మాధవీసనారా ”

తెలివితేటలు గురించీ, పదుగురి నోటా వినడంతో, అతడికి, ఆమెను వివాహ మాడాలన్న కోర్కె గలిగింది.

అతడు రాజభవనానికి వెళ్ళి, రాజు కళ్యాణవర్మతో, తానెవరైనదీ వివరించి, వచ్చిన పని గురించి చెప్పాడు. రాజు, అతణ్ణి అప్పటికప్పుడే శోభ దగ్గిరకు తీసుకు పోయాడు.

ఆనందవర్ధనుడు, శోభను చూస్తూనే, "ఈవిడే, నా భార్య!" అన్నాడు.

రాజు కళ్యాణవర్మతోపాటు, అక్కడ వున్నవాళ్ళందరూ విస్తుపోయారు.

ఆనందవర్ధనుడు, రాజుతో, "ఆశ్చర్య పడకండి, మహారాజా! కొద్ది దినాలకిందట ఈమెను, ఒక దేవాలయం దగ్గిర, దొంగల నుంచి కాపాడాను. నా సాహసానికి అబ్బుర పాటు చెంది, కృతజ్ఞతలు చెప్పింది. అప్పటికప్పుడే, గాంధర్వవిధిగా వివాహం చేసుకున్నాం," అన్నాడు.

కళ్యాణవర్మ, కుమార్తెను, "అమ్మా, ఈ సంగతి నిజమేనా?" అని అడిగాడు.

శోభ సమాధానం చెప్పలేదు. కాని, ఆనందవర్ధనుడి సాహసాన్ని, ఆమె మనసులోనే అభినందించింది.

శోభ మాట్లాడకపోవడంతో, ఆనంద వర్ధనుడు, రాజుతో, "చూశారా, మహా రాజా! సిగ్గువల్ల, ఆమె ఏమీ చెప్పలేక పోతున్నది. మౌనం అర్ధాంగీకారం, అన్న సంగతి, మీకు తెలియందికాదు. కాబట్టి, నా భార్యను, యిప్పుడే నా వెంట పంపండి." అన్నాడు.

ఆ మాటలు వింటూనే శోభ కోపంగా, "అంతా అబద్ధం!" అన్నది.

శోభ మౌనభంగం చూస్తూనే, ఆనంద వర్ధనుడు బిగ్గరగా నవ్వాడు. రాజు కళ్యాణవర్మ, ఆనందవర్ధనుడి తెలివి తేటలకూ, తెగువతనానికీ సంతోషిస్తూ, కుమార్తెకేసి చూశాడు.

శోభ చిరునవ్వునవ్వుతూ, తల పక్కకు తిప్పుకున్నది. కళ్యాణవర్మ, ఆనంద వర్ధనుడితో, శోభ వివాహం వైభవంగా జరిపించాడు.



మనదేశపు అద్భుతాలు :

# జింజీకోట




తమిళనాడులోని దక్షిణ ఆర్కాటు జిల్లాలో మూడు కొండలపైన జింజీ కోట శిథిలాలు విస్తరించి ఉన్నాయి. కొన్ని శతాబ్దాలపాటు దక్షిణ భారత దేశంలో రాజకీయరంగంలో వచ్చిన మార్పులకు ఈ కోట సాక్షీభూతంగా ఉన్నది. వివిధ కాలఘట్టాలలో చోళులు, హొయసాలులు, విజయనగరం రాజులు, మహారాష్ట్రులు, మొగలులు ఈ కోటను పాలించారు.



ఒకానొకప్పుడు అనందకోన్ అనే పశువులు కాచే కుర్రవాడొకడు, ఈ కొండ మీద పశువులు కాస్తున్నప్పుడు, ఒక గుహలో అతనికి నిధి నిక్షేపాలు కనిపించాయట. వెంటనే అతడు, మరి కొందరు కుర్రవాళ్ళను వెంట తీసుకుపోయి, ఆ నిధి నిక్షేపాలు తరిలించుకు వచ్చాడు.

కొన్నాళ్ళకు అతడు పరిసర ప్రాంతాలను వశపరచుకుని, తనను ఆ ప్రాంతానికి రాజుగా ప్రకటించుకున్నాడు. అక్కడి మూడు కొండలలో ఒకటయిన రాజగిరి మీద చక్కటి భవనాన్ని నిర్మించాడు.





శత్రువు లెవ్వరుగాని, అంత సులభంగా చేరుకోలేని సురక్షిత స్థలంలో ఆ భవనం నిర్మించబడింది. ఎత్తయిన దారినీ భవనాన్నీ వేరుచేస్తూ లోతైన అగాథం తవ్వబడింది. దారినీ, కోటనూ కలుపుతూ, అగాథం మీద అడ్డుగా కొయ్య వంతెననిర్మించబడింది. కావాలన్నప్పుడు దానిని సులభంగా అవతలికి తొలగించవచ్చు.

జింజీపాలకులు వివిధ రాజులకు, చక్ర
వర్తులకు సామంతులుగా ఉండేవారు.
నాయక రాజుల కాలంలో ఈ కోట
మరింత బలపడింది. అయినా ఆ కాల
ఘట్టంలోనే బీజపూరు సుల్తాను సైన్యాలు
ఈ కోటను ముట్టడించి, నాయక
రాజును ఓడించి, 20 కోట్లరూపాయలు
కొల్లగొట్టుకుని పోయాయి!





ఆ తరవాత మహారాష్ట్ర మహావీరు
డయిన శివాజీ కర్ణాట దండయాత్ర
జరిపినప్పుడు ఈ కోటను పట్టుకున్నాడు.
శివాజీ మరణానంతరం మొగలులు
కోటను ముట్టడించారు. కాని, అంత
సులభంగా పట్టుకోలేకపోయారు.

జింజీకోటను ముట్టడించమని మొగలు
పాదుషా, ఆర్కాటు నవాబును, ఆదే
శించిన సమయంలో, జింజీకోటను
ఇరవై రెండేళ్ల యువకుడయిన దేశింగు
రాజు పరిపాలించేవాడు. యుద్ధానికి
ముందు, దేశింగురాజు దాపులనున్న
రంగనాథ అలయానికి వెళ్ళి విగ్రహానికి
నమస్కరించినప్పుడు రంగనాథస్వామి
విగ్రహం తల మరోవైపుకు తిరిగి
పోయిందట!






యుద్ధ పర్యవసానం సానుకూలంగా ఉండదని గ్రహించి కూడా, దేశింగు రాజు శత్రువులను ఎదుర్కొని ఏడు సంవత్సరాలపాటు వీరోచితంగా పోరాడి యుద్ధరంగంలోనే ప్రాణాలు వదిలాడు. ఆ పిమ్మట ఆయన భార్య అగ్నిప్రవేశం చేసింది.

ఆ దుర్ఘటనతో జింజీకోట వైభవోపేతమైన రోజులు అంతరించాయి. అయినా ఈనాడు కూడా ఆ స్థలం, అనేక అద్భుతమైన కట్టడాలతో పలువురిని ఆకర్షిస్తూ ఉన్నది. వాటిలో ముఖ్యమైనది కల్యాణ మహలు !





చిన్న బావి వంటి గొయ్యి గల ఎత్తయిన బండను మరణశిఖరం అని పిలుస్తారు. ఆ రోజులలో మరణదండన పొందిన నేరస్థులను ఈ గోతిలోకి తోసేవాళ్ళు. ఈనాటికీ చెక్కుచెదరకుండా ఉన్న అశ్వశాల ఆనాడు గుర్రాల పరిరక్షణకు, నాటి పాలకులు తీసుకున్న శ్రద్ధకు చక్కటి తార్కాణం !



# తాతయ్య పెళ్లి

పెనుగొల్లు గ్రామంలో వుండే రామానుజం, చాలా ధనవంతుడు. వ్యాపారంలో యిప్పటికీ యింకా ఆర్జిస్తున్నాడు. అరవై ఏళ్ళ వయసులో వున్న రామానుజానికి కొడుకూ, కూతురూ, మనమలు, మనమరాళ్ళు కూడా వున్నారు. ఆయన భార్య పోయి చాలా ఏళ్ళయింది.

ఒకనాడు, రామానుజం హఠాత్తుగా, పెళ్ళి సంబంధాలు చూసే కృష్ణశర్మకు కబురుపెట్టి, అతను రాగానే, "శర్మగారూ, నాకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలని వున్నది. ఎక్కడైనా పాతిక సంవత్సరాల లోపు వయసున్న, మంచి అందమైన అమ్మాయిని చూడండి. నేను ఆస్తి వున్న వాణ్ణి గదా అని, వరకట్నం ఏ మాత్రం ఆశించడం లేదు. నేనే, ఆ పిల్ల తల్లిదండ్రులకు తృణమో, పణమో యిచ్చుకోగలను," అని చెప్పాడు.

రామానుజం కోరిక విని, కృష్ణశర్మ ఆశ్చర్యపోయాడు. మంచివాడనీ, ధర్మబుద్ధి గలవాడనీ, రామానుజానికి పేరున్నది. ఈ వయసులో, ఆయనకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనే బుద్ధి పుట్టడమేమిటి? అందుకే, ఎవరికి, ఏ కాలానికి ఎటువంటి బుద్ధులు పుడతాయో చెప్పలేమంటారు, పెద్దలు—అని, కృష్ణశర్మ, తనకుతాను సర్ది చెప్పుకున్నాడు.

"అలాగే, బాబూ! త్వరలోనే, సంబంధం విషయం, తమకు తెలియజేస్తాను," అని కృష్ణశర్మ వెళ్లిపోయాడు.

ఆ సమయంలో, రామానుజం కోడలు జయలక్ష్మి ఇంట్లోనే వున్నది. ఆమె, మామగారి కోరిక విని, ఎక్కడలేని ఆశ్చర్యం పొందింది.

సాయంత్రం ఇంటికి వచ్చిన, రామానుజం కొడుకు వెంకటరమణ, భార్య

ఎస్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి



చెప్పగా సంగతి తెలుసుకుని, "అమ్మ పోయి నాలుగేళ్ళయింది. ఇన్నేళ్ళుగా లేనిది, నాన్నకు హఠాత్తుగా యిలాంటి ఆలోచన ఎందుకు వచ్చిందో, అర్థం కావడం లేదు. ఆయన అనుకున్నది చేసి తీరుతాడు. మనం ఏమి చెప్పీ ప్రయోజనం లేదు," అన్నాడు.

పది రోజులు గడిచాక, రామానుజం ఇంటికి కృష్ణశర్మ వచ్చి, "బాబూ, తమకు తగిన సంబంధం వెతకడం, చాలా శ్రమ యింది. సర్వసిద్ధి గ్రామంలో, ముని రామయ్యగారనే ఆయన, తన కూతురు రత్నకు, కట్నకానుకలిచ్చి వివాహం చెయ్యలేక చాలా బాధపడుతున్నారు. ఆయనకు, ఆ అమ్మాయి తరవాత, యింకా యిద్దరాడపిల్లలు," అని చెప్పాడు.

అందుకు రామానుజం, "అయితే, ఆయనకు, నా వయసూ అదీ చెప్పారా? పిల్లనివ్వడానికి పూర్తిగా అంగీకారం తెలిపినట్టేనా?" అని అడిగాడు.

"తమ గురించిన అన్ని వివరాలూ చెప్పాను. తమ కుమార్తెకు వివాహం అయితే చాలు, అన్నారు. ఆ రత్నకు, యిరవై రెండేళ్ళ వయసు. లక్ష్మిలా వుంటుంది," అన్నాడు కృష్ణశర్మ.

"సరే, ఆ పిల్లను చూడాలి. మంచి రోజేదో చెప్పండి," అన్నాడు రామానుజం.

కృష్ణశర్మ పంచాంగం చూసి, "వచ్చే లక్ష్మివారం, దివ్యంగా వున్నది," అన్నాడు.

ఈ విషయం తెలుసుకున్న, పెనుగొల్లులోని అమ్మలక్కలందరూ, రామానుజం వీధిలోకి వెళ్ళినప్పుడల్లా, "అహాఁ, ఈ తాతయ్యకే పెళ్ళి!" అంటూ గుసగుసలాడడం ప్రారంభించారు.

కొడుకు వెంకటరమణా, కోడలూ, రామానుజాన్ని, ఇదేమిటని అడగలేదు; అయినా, యీ ప్రసక్తి వాళ్ళ దగ్గిర తేలేదు.

అనుకున్న ప్రకారం, లక్ష్మివారం నాడు కృష్ణశర్మ రాగానే, రామానుజం ముస్తాబయి, ఒక సంచీ చేత బట్టుకుని, సర్వసిద్ధికి బయలుదేరాడు.

మునిరామయ్య, రామానుజానికి మర్యాదలు చేసి, పెళ్ళికూతురుని ఆయనకు చూపించాడు. రత్నం నిజంగా రత్నం లాగే వున్నది!

రామానుజం, ఆమెను చూసి తృప్తిగా తలాడించి, మునిరామయ్యతో, "మునిరామయ్యగారూ, నేను పెళ్ళి మాట ఎత్తేసరికి, అందరూ చాటుగా, యిది తాతయ్య పెళ్ళి అనుకోవడం, నాకు తెలుసు. నా భార్య పోయి, నాలుగేళ్ళయింది. కావాలనుకుంటే, అప్పుడే పెళ్ళి చేసుకునేవాడిని. కాని, నాకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనే ఆలోచనేలేదు," అన్నాడు.

ఆ మాట వింటూనే, మునిరామయ్య ముఖం కందగడ్డలా అయింది. "తమరు పెద్ద మనుషులనుకున్నాను. ఇదంతా ఏమిటి?" అని అడిగాడు.

కృష్ణశర్మ మతిపోయినవాడిలా దిక్కులు చూడసాగాడు.

రామానుజం ఎంతో శాంతంగా, "ఆవేశపడకండి, మునిరామయ్యగారూ! నావంటి ముసలివాడికి, బంగారం లాంటి పిల్లనివ్వడానికి సిద్ధపడ్డారంటే, మీ రెలాంటి గడ్డుపరిస్థితుల్లో వున్నారో, నా కర్థమైంది. ఈ సంగతి, నాకై నేను తెలుసుకోలేను గనక, కృష్ణశర్మగారిని కొంత శ్రమ పెట్టాను. మీవంటివారికి సాయపడడమే, నా ఉద్దేశం," అంటూ సంచీలోంచి కొంత డబ్బు తీసి, మునిరామయ్యకు చూపించాడు.



రామానుజం మాటలూ, డబ్బూ చూసి అందరూ నిశ్చేష్టులయారు.

అప్పుడు రామానుజం, "ఈ సంచీలో ఇరవైవేల రూపాయలున్నవి. నా భార్య అంతకలవారి ఇంటి ఆడబడుచుకాదు. అయినా, కట్నం పేరుతో మా నాన్న, వాళ్ళ నుంచి పెద్ద మొత్తమే రాబట్టాడు. నా భార్యకు యిది బాగా జ్ఞాపకం వున్నది. ఆమె ప్రోద్బలం వల్లనే, నేను కానీకట్నం తీసుకోకుండా, కోడలిని తెచ్చుకున్నాను. ఈ సంగతి కృష్ణశర్మగారికి బాగా తెలుసు!" అన్నాడు.

"అవును, బాబూ! తమ ధర్మగుణం ఊరందరికీ తెలిసిందే," అన్నాడు కృష్ణశర్మ.

"మునిరామయ్యగారూ, నాలో ఏ కొద్ది పాటి ధర్మగుణం అయినా వుంటే, అది నా భార్య కారణంగా అబ్బినది. ఆమె చనిపోయేముందు, తన బంగారుకంటే, కాసులపేరూ యిచ్చి, అవి అమ్మి— పేదరికంవల్ల, కట్నకానుక లిచ్చి కూతురుకు వివాహం చేయలేని తల్లిదండ్రులకు సాయపడమన్నది. ఆ నగలు అమ్మి, ఆ డబ్బును వ్యాపారంలో వేరుగాపెట్టి, ఈ ఇరవైవేల కన్న మించిన మొత్తమే సంపాయించాను. మిగులు ధనాన్ని మరెవరికైనా సాయపడేందుకు ఉపయోగిస్తాను." అంటూ డబ్బు సంచిని మునిరామయ్యకు యిచ్చాడు.

రామానుజం ఉదారబుద్ధి చూసి, కృతజ్ఞతతో మునిరామయ్య, అతడి భార్య కళ్ళ నుంచి జలజల నీళ్ళు కారాయి.

"ఈ సొమ్ముతో వరుణ్ణి చూసి, అమ్మాయికి పెళ్ళి చేయండి. ఇక వస్తాను!" అని రామానుజం లేచి నిలబడ్డాడు.

"రామానుజంగారూ, మీ రుణం యీ జన్మలో తీర్చుకోలేనిది!" అంటూ మునిరామయ్య, రామానుజం రెండు చేతులూ పట్టుకున్నాడు.

అంతవరకూ తలుపు వారగా నిలబడి, అంతా వింటున్న రత్నం ముందుకువచ్చి, రామానుజం పాదాలకు నమస్కరించింది.






మవర్నాడు రాముడు కొలువు తీరి ఉండగా, ఒక కుక్క వచ్చి బయట మొరిగింది. ఆ కుక్క రాజుతో ఏదో ఫిర్యాదు చెయ్య గోరుతున్నదని లక్ష్మణుడు తెలుసుకుని, దాన్ని తిన్నగా సభలోకి తీసుకు వచ్చాడు.

తల పగిలి ఉన్న ఆ కుక్కను చూసి రాముడు ఎంతో జాలిపడి, ''నీకు కలిగిన కష్టం గురించి నాతో నిర్భయంగా చెప్పు,'' అన్నాడు.

''సర్వార్థసిద్ధి అనే భిక్షువు నా తల పగలగొట్టాడు. నే నతని కే అపకారమూ చెయ్యలేదు,'' అన్నది కుక్క.

రాముడు వెంటనే ఆ భిక్షువును పిలిపించి, ''నీ వీ కుక్క తల ఎందుకు పగలగొట్టావు? అది నీ కే మపకారం చేసింది?'' అని అడిగాడు.

''రాజా, నేను భిక్ష కోసం ఇల్లిల్లు తిరుగుతున్నాను. నా కెక్కడా భిక్ష దొరకలేదు. ఈ స్థితిలో ఈ కుక్క నా దారికి అడ్డంగా నిలబడి, ఎంత అదిలించినా పోలేదు. కోపం ఆచుకోలేక దాన్ని తల మీద కొట్టిన మాట నిజమే. దాని కేమి దండన విధిస్తారో విధించండి,'' అన్నాడు సర్వార్థసిద్ధి.

అతనికి ఎలాటి శిక్ష విధిస్తే బాగుంటుం దని రాముడు సభలోని వాళ్ళను అడి గాడు. సభలో ఎందరో పండితు లుండి కూడా ఒక్కరూ సూటిగా సమాధానం చెప్పలేదు.

10. కుశలవుల జననం



అప్పుడు కుక్క రాముడితో, "రామా, ఇతనికి నేను చెప్పిన శిక్ష వెయ్యి. కాలం చర మనే చోట కులపతిగా ఇతనికి ఉద్యోగ మియ్యి," అన్నది.

రాము డతనికి ఆ ఉద్యోగం ఇచ్చి, ఏనుగు మీద ఎక్కించి పంపేశాడు. భిక్షువు కూడా పరమానందం చెంది వెళ్ళి పోయాడు.

తరవాత రాముడూ, మంత్రులూ ఆ కుక్కను, "ఆ భిక్షువుకు ఇలాటి శిక్ష ఎందుకు వేయించావు? దీని కేదో కారణం ఉండాలి," అన్నారు.

"నేను కిందటి జన్మలో ఆ ఉద్యోగమే చేశాను. ఆ పదవిలో నాకు చక్కని భోజనమూ, దాసదాసీలూ, సమస్తమూ అమరి ఉండేవి. ఎంతో భూతదయ గలిగి, వినయమూ, శీలమూ కలవాడి ననిపించు కున్నాను. దేవబ్రాహ్మణ పూజ చేశాను. అయినప్పటికీ ఆ పదవిలో ఉండిన కారణంగా నా కీ నీచజన్మ కలిగింది. మహాకోపి, దయారహితుడూ అయిన ఈ భిక్షువు ఆ పదవి నిర్వహించాడో జన్మ జన్మలకీ ఘోర నరకంపాలు అయి తీరు తాడు," అన్నది కుక్క.

కుక్క సభనుంచి సంతోషంగా వెళ్ళి పోయింది.

కొన్నాళ్ళకు ఒక గుడ్లగూబా, గద్దా తగాదా పడి తీర్పు చెప్పమని రాముడి వద్దకు వచ్చాయి. ఒక వనంలో ఒక ఇల్లున్నది. ఆ ఇల్లు నాదంటే నాదని రెండు పక్షులూ తగాదాపడి తీర్పు చెప్ప మని రాముడి సమక్షానికి వచ్చాయి.

వాటి తగాదా తీర్చేటందుకు గాను రాముడు పుష్పకవిమానం మీద తన మంత్రులతో సహా వనంలో ఆ ఇల్లున్న చోటికి వెళ్ళాడు.

"ఈ ఇంటిని నువ్వెప్పుడు కట్టు కున్నావు?" అని రాముడు గద్ద నడిగాడు.

"భూమి మీద మనుషులు పుట్టిన కాలంలో నే నీ ఇల్లు కట్టుకున్నాను. ఇది నా ఇల్లే," అన్నది గద్ద.

వెంటనే గుడ్లగూబ, "రామా, భూమి మీద చెట్లు ఏర్పడిన కాలంలో నే నీ ఇంటిని కట్టాను," అన్నది.

వెంటనే రాముడి మంత్రులు ఆ ఇల్లు గుడ్లగూబదే నని తేల్చారు. ఎందుచేత నంటే సృష్టిలో మొదట వచ్చినవి వృక్ష జాతులు. గుడ్లగూబ ఇంటిని కాజెయ్యా లని చూస్తున్నది గనక గద్దను శిక్షిస్తా నన్నాడు రాముడు. అప్పుడు ఆకాశవాణి ఇలా పలికింది.

"రామా, అసలే శాపం తిని ఉన్న ఈ గద్దను ఇంకా ఎందుకు శిక్షిస్తావు? ఈ గద్ద బ్రహ్మదత్తు డనే రాజు, మహా శూరుడు, సత్యవ్రతుడు. ఇతని ఇంటికి గౌతముడు వచ్చి అతిథిగా ఉన్నాడు. గౌతముడికి రాజు స్వయంగానే అర్ఘ్యపాద్యా లిచ్చాడు. గౌతముడు బ్రహ్మదత్తుడి ఆతిథ్యం స్వీకరిస్తున్న సమయంలో ఒక నాడు ఆయన భోజనంలోకి పొరపాటున మాంసం వచ్చింది. అది చూసి గౌతముడు కోపించి, రాజును గద్దవు కమ్మని శపించాడు. ఇక్ష్వాకు వంశంలో పుట్టే రాముడు తాకినప్పుడు శాపవిముక్తి కలుగుతుందని కూడా గౌతము డన్నాడు."

ఆకాశవాణి పలికిన ఈ మాటలు విని రాముడా గద్దను తాకాడు. వెంటనే గద్ద ఒక దివ్యపురుషుడుగా మారింది. ఆ



పురుషుడు రాముడికి కృతజ్ఞత తెలుపుకుని వెళ్ళిపోయాడు.

యమునా తీర వాసులైన మునులు నూరుమందికి పైగా రాముడి దర్శనార్థం ఒకనాడు వచ్చారు. వారు కలశాలతో తెచ్చిన నీరూ, పళ్ళూ మొదలైన కానుకలు స్వీకరించి, వారందరినీ సుఖాసీనులను చేసి రాముడు, వారు వచ్చిన పని అడిగాడు. లవణాసురు డనేవాడు తమని మహాబాధ పెడుతున్నాడనీ, వాడి బాధ నుంచి విముక్తి కలిగించమనీ మునులు రాముణ్ణి కోరారు.

ఈ లవణాసురు డనేవాడు మధు వనే రాక్షసుడి కొడుకు. మధువు రుద్రుణ్ణి



గురించి బహుదీర్ఘమైన తపస్సు చేసి, ఆయనను మెప్పించాడు. దాని ఫలితంగా రుద్రుడు తన త్రిశూలంలో నుంచి మరొక త్రిశూలం చేసి మధువు కిస్తూ, "ఇది వెంట ఉన్నంత కాలమూ నిన్నెవరూ జయించలేరు," అని చెప్పాడు. ఆ త్రిశూలాన్ని వంశపరంపరగా తన ఇంటనే ఉండేటట్టు అనుగ్రహించమని మధువు శివుణ్ణి వేడుకున్నాడు.

"నీ అనంతరం ఈ త్రిశూలం నీ కొడుక్కు మాత్రమే ఉంటుంది. అటుపైన ఉండదు," అన్నాడు శివుడు.

ఆ మధువు రావణుడికి చెల్లెలు వరస అయిన కుంభీనసను పెళ్ళాడాడు. వారికి లవణుడు పుట్టాడు. వాడు పసితనం నుంచీ మహాపాపి. వాణ్ణి మంచి దారిన పెట్టటం మధువువల్ల కాలేదు. మధువు వరుణలోకానికి వెళ్ళిపోతూ, శివుడు తన కిచ్చిన త్రిశూలాన్ని లవణుడి కిచ్చాడు. దాని అద్భుతశక్తి నెరిగిన లవణుడు మరింత విజృంభించి, అందరినీ బాధిస్తున్నాడు. మునులను మరింత వేపుకు తింటున్నాడు.

మునులు చెప్పిన విషయాలన్నీ ఆలకించి రాముడు వారితో, "లవణాసురుణ్ణి నేను చంపిస్తాను. మీరు నిర్భయంగా ఉండండి," అని వాళ్ళకు అభయమిచ్చాడు. తరవాత అతను తన తమ్ములను చూసి, "లవణాసురుణ్ణి చంపే పనికి మీలో ఎవరు పూనుకుంటారు?" అని అడిగాడు.

భరతుడు తానా పని చేస్తానన్నాడు. కాని శత్రుఘ్నుడు భరతుడి పైన పోటీకి వచ్చి, తానే లవణాసురుణ్ణి చంపుతాననీ, తానుండగా భరతుడు శ్రమపడటం భావ్యం కాదనీ, పడవలసిన శ్రమలన్నీ భరతుడు లోగడ నందిగ్రామంలో ఉన్నప్పుడే పడ్డాడనీ అన్నాడు.

రాముడందుకు ఒప్పుకుని శత్రుఘ్నుణ్ణి మధుపురానికి రాజుగా అభిషేకించే ఏర్పాట్లు చేశాడు. ఒక రాజు చచ్చిపోతే

మరొకడు వెంటనే రాజ్యభారం వహించటానికి సిద్ధంగా ఉండాలి. శత్రుఘ్నుడి రాజ్యాభిషేకోత్సవంముగియగానే రాముడు అతని కొక బాణం ఇచ్చి, ఇలా చెప్పాడు: "ఈ బాణం మధుకైటభులను చంపినది. దీన్ని నేను రావణుడి పైన కూడా ప్రయోగించలేదు. దీనితో నీవు లవణాసురుణ్ణి చంపు. మరొక సంగతి. లవణుడి వద్ద శివుడి త్రిశూలానికి సమమైన శూలం ఉన్నది. అది వాడి చేతిలో ఉండగా ఎవరూ వాణ్ణి జయించలేరు. అందుచేత నీ వేం చేస్తావంటే—లవణుడి త్రిశూలం వాడి ఇంటనే ఉంటుంది. వాడు నగరం వదిలి ఎటైనా వెళ్ళి ఉన్న సమయంలో నీవు నగర ద్వారం ముట్టడించి, వాడు తిరిగి వచ్చినప్పుడు ద్వారం వద్దనే అటకాయించి చంపు. ఏ పరిస్థితిలోనూ వాడు నగరంలోకి వెళ్ళరాదు, త్రిశూలం వాడి చేతికి చిక్కరాదు."



అంతే కాదు; శత్రుఘ్నుడు ముందుగా సేనను పంపి, తరవాత తాను ఒంటరిగా వెళ్ళాలి. తనను చంపటానికెవరో వస్తున్నట్టు లవణుడికి తెలియగూడదు. గ్రీష్మర్తువులోనే సేనలు గంగ అవతలి ఒడ్డు చేరి అక్కడ విడియాలి. శత్రుఘ్నుడు వర్షాకాలారంభంలో విల్లుబాణాలు తీసుకుని బయలుదేరి వెళ్ళి లవణాసురుణ్ణి చంపాలి. ఈ విధంగా రాముడు యుద్ధగతి నిర్ణయించాడు.

ఆ ప్రకారమే శత్రుఘ్నుడు ముందుగా తన సేనలను పంపి, ఒక మాసం గడిచాక తాను బయలుదేరాడు. దారిలో రెండు రోజులపాటు అతను వాల్మీకి ఆశ్రమంలో నిలిచాడు. వాల్మీకి అతనికి ఆతిథ్యమిచ్చి, ఆ ఆశ్రమం ఒకప్పుడు రఘువంశం వారిదే నంటూ దాని పూర్వ వృత్తాంతం ఇలా చెప్పాడు:

రఘు వంశంలో ఒకప్పుడు సుదాసు అనేవా డుండేవాడు. ఆయన కొడుకు వీరసహుడు. చిన్నతనంలోనే వేటకు వెళ్ళి, వనంలో ఇద్దరు రాక్షసులను



చూశాడు. ఆ రాక్షసులు పులుల రూపంలో తిరుగుతూ కనిపించిన మృగాన్నెల్లా తినేస్తూ, అరణ్యమంతా పాడు పెట్టేశారు. ఎక్కడా ఒక మృగం లేదు. అది చూసి వీరసహుడికి చాలా కోపం వచ్చింది. అతనా రాక్షసు లిద్దరినీ చూస్తూనే వారిలో ఒకణ్ణి చంపేశాడు. అప్పుడు రెండోవాడు, "పాపీ, అకారణంగా నా అనుచరుణ్ణి చంపావుకదూ ? నిన్నేం చేస్తానో చూడు," అంటూ మరు క్షణమే అదృశ్యుడయి పోయాడు.

కొంతకాలం గడిచింది. ఆ రాజు ఇదే ఆశ్రమంలో ఒక బ్రహ్మాండమైన అశ్వమేధ యాగం చేశాడు. వసిష్ఠుడే ఆ యాగం చేయించాడు. యాగం పూర్తి అయేసరికి వెనకటి రాక్షసుడు, రాజు పైన పగబట్టి ఉన్నవాడు గనక, వసిష్ఠుడి రూపంలో వచ్చి, "రాజా, యజ్ఞం పూర్తి అయింది. నాకు చక్కని మాంసభోజనం పెట్టు." అని అడిగాడు.

రాజు సంతోషించి వంటవాణ్ణి పిలిచి, "గురువుగారికి హవిస్సు మాంసంతో రుచిగా భోజనం తయారుచెయ్యి." అన్నాడు.

ఈ లోపుగానే రాక్షసుడు వంటవాడి రూపంలో నరమాంసంతో వంట సిద్ధం చేసి, రాజుకు చూపించి, "హవిస్సుతో చక్కని వంట చేశాను," అన్నాడు.

రాజు వసిష్ఠుడికి తన భార్య అయిన మదయంతి చేత ఆ నరమాంసం వడ్డింపించాడు. వసిష్ఠుడు రాజు తనకు వడ్డించినది నరమాంసమని గుర్తించి, పట్టరాని ఆగ్రహంతో, "నువు నరభక్షకుడివై పో !" అని రాజును ఘోరంగా శపించాడు.

రాజుకు కూడా కోపం వచ్చి, వసిష్ఠుణ్ణి శపించటానికి నీరు చేతిలోకి తీసుకున్నాడు. కాని అతను శపించే లోపుగా మదయంతి అడ్డుపడి, "ఆయన మనకు దేవుడిలాటి వారు. ఆయనను శపించరాదు," అన్నది. అప్పుడు రాజు చేతిలో నీళ్ళను తన పాదాల మీదనే పోసుకున్నాడు. ఆ నీటి

వల్ల రాజు పాదాలకు కల్మషం కలిగింది. అప్పటి నుంచీ అతనికి కల్మాషపాదుడనే పేరు వచ్చింది.

తరవాత వసిష్ఠుడు జరిగిన సంగతి గ్రహించి, కల్మాషపాదుడికి శాపఫలం పన్నెండేళ్లే ఉండేటట్టు అనుగ్రహించాడు.

రాజు పన్నెండేళ్ళపాటు నరభక్షకుడుగా జీవించి, శాపం తీరి మామూలు మనిషి అయి, ఎప్పటిలాగే చక్కగా రాజ్యపాలన చేశాడు.

ఈ కథను వాల్మీకివల్లవిని, శత్రుఘ్నుడు పర్ణశాల ప్రవేశించే సమయానికి సీత కవలపిల్లలను కన్నది. ఈ వార్త ముని కుమారుల ద్వారా వినగానే వాల్మీకి వెళ్లి, బాలచంద్రుల్లాగా ప్రకాశించే పిల్లలను చూసి, రక్షలు కట్టి, పెద్దవాడికి కుశుడనీ రెండోవాడికి లవుడనీ పేర్లు పెట్టాడు.

ఇది జరిగింది సరిగా అర్ధరాత్రివేళ. ఆ సమయంలోనే శత్రుఘ్నుడు సీత వద్దకు వెళ్ళి, "అమ్మా, అదృష్టం," అని ఎంతో సంతోషించాడు.

మర్నాడు అతను వాల్మీకివద్ద సెలవు పుచ్చుకుని, పడమరగా ప్రయాణిస్తూ, ఏడు రోజుల తరవాత యమునాతీరం చేరి, అక్కడ ఉన్న మునుల ఆశ్రమాలలో సత్కాలక్షేపం చేస్తూ ఆ రాత్రి గడిపాడు.

మర్నాడు తెల్లవారగానే శత్రుఘ్నుడు చ్యవన మహామునిని లవణాసురుణ్ణి గురించీ, వాడి త్రిశూలం గురించీ అడి



గాడు. వాడా శూలంతో ఎన్నో దారుణాలు చేశాడని చెబుతూ చ్యవనుడు మాంధాత వృత్తాంతం వివరించి చెప్పాడు.

అయోధ్య రాజైన యువనాశ్వుడి కుమారుడు మాంధాత. మహాబలవంతుడైన ఆ మాంధాత భూమిలో ఉండే రాజుల నందరినీ జయించి, స్వర్గానికి వెళ్ళి దాన్ని కూడా జయించ నిశ్చయించాడు. ఆ సంగతి తెలిసి, ఇంద్రుడు మొదలైన దేవతలు భయపడ్డారు. ఇంద్రుడి అర్థాసనమూ, దేవతల సేవా కోరి వచ్చిన మాంధాతతో ఇంద్రుడు మంచిగానే, "ముందు భూలోకాన్ని జయించి రా, అప్పుడు దేవలోకాన్ని నీ కిచ్చేస్తాం." అన్నాడు.

"అదేమిటి? నేను భూలోక మంతా అదివరకే జయించాను. అక్కడ నా శాసనానికి ఏమాత్రం ఎదురులేదు." అన్నాడు మాంధాత.

"మధువనంలో లవణాసురుడనేవాడున్నాడు. వాడు నీకు లోబడి నడుచుకుంటున్నాడా?" అని ఇంద్రుడు మాంధాత నడిగాడు.

మాంధాత సిగ్గుపడి తల వంచుకుని భూమికి తిరిగి వచ్చి, లవణుణ్ణి జయించటానికి సేనా సమేతుడై బయలుదేరి వెళ్లి, తనకు లొంగిపొమ్మని దూత ద్వారా లవణుడికి కబురు చేశాడు. లవణుడా దూతను పట్టుకుని తినేశాడు.

ఎంత కాలానికీ దూత తిరిగి రాకపోగా మాంధాత లవణుడి పైన యుద్ధం ప్రారంభించాడు. లవణుడు మాంధాతను చూసి, పకపక నవ్వి, తన శూలాన్ని ప్రయోగించేసరికి, అది మాంధాతతో సహా అతని సైన్య మంతటినీ ఒక్క క్షణంలో భస్మం చేసేసింది.

చ్యవను డీ సంగతి చెప్పి, "వాడి చేతిలో ఆ త్రిశూలం లేని సమయంలోనే నువు వాణ్ణి చంపాలి. రేపే ఆ పని చెయ్యగలుగుతావు." అన్నాడు.

ఆ రాత్రి కబుర్లతో సులువుగా గడిచిపోయింది.





# సైనికుడి యుక్తి

హంగరీ సైనికులను హుజార్ లంటారు. వాళ్ళు ఒకసారి సైనికులుగా చేరారంటే పన్నెండేళ్ళపాటు విధిగా రాజుగారికి సేవ చెయ్యాలి.

మాత్యాష్ అనేవాడు హంగరీకి రాజు అయాక, అతను తన సైనికులు ఎప్పుడూ తప్పతాగి ఉండటం గమనించాడు. హుజార్ సైనికుడికి వారం వారం ఇచ్చే జీతం నాలుగు కాసులు. అంత కొద్ది డబ్బుతో హుజార్లు అస్తమానమూ ఎలా తాగగలుగుతున్నారో ఆయనకు అర్థం కాలేదు. సైనికోద్యోగుల నడిగితే వాళ్ళేమీ చెప్పలేకపోయారు.

ఈ రహస్యాన్ని తానే స్వయంగా తెలుసుకోవాలనుకుని రాజు హుజార్ దుస్తులు ధరించి, జేబులో నాలుగు కాసులు మాత్రమే వేసుకుని, సాధారణ సైనికుడిలాగా వినోదార్థం బయలుదేరాడు.

ఆయన ఆనాటి సాయంకాలానికి నగరం వెలపల ఉన్న ఒక సారా అంగడికి చేరాడు.

అంగడి ద్వారం చేరుతూ ఉండగానే లోపలినుంచి నవ్వులూ, కేకలూ వినిపించాయి. తాను కూడా తన నాలుగు కాసులతో వినోదం పొందటానికి అది తగిన స్థలమే ననుకుని రాజు లోపలికి అడుగు పెట్టాడు.

లోపల నలుగురు పాత హుజార్లున్నారు. వారిలో ఒకడు కొత్త హుజారును చూస్తూనే అతని చెవి పట్టుకుని నిలవేసి, "ఏం, కుర్రకుంకా? సైన్యంలో ఎప్పుడు చేరావు?" అని అడిగాడు.

"ఒక వారం క్రితం," అన్నాడు రాజు.

పాత హుజారు రాజు భుజం తట్టి, "నీకింకా పన్నెండేళ్ళపాటు కష్టాలున్నా

హంగరీ జానపద కథ



యన్నమాట. దాన్ని గురించి ఆలోచించకు. రెండు కాసుల బ్రాందీ కొను, జల్సా చేద్దాం," అన్నాడు.

"నా దగ్గిర డబ్బులేవు మేం చాలా పేదవాళ్ళం," అన్నాడు రాజు.

"అయితే అయింది. నిన్ననే జీతం వచ్చి ఉండాలి. ఒక కాసు బ్రాందీ అయినా నాకు పోయించి తీరాలిసిందే, తప్పదు," అన్నాడు పాత హుజారు.

రాజుకు తప్పలేదు. ఒకడికి బ్రాందీ పోయించేసరికి మిగిలిన ముగ్గురు పాత హుజార్లూ రాజుచేత తలా ఒక కాసు బ్రాందీ కొనిపించి తాగేశారు. రాజు జేబులు ఖాళీ అయాయి.

కాని, అప్పటికీ వాళ్ళకు తాగుడు చాలలేదు. వాళ్ళలో యోష్కా అనేవాడు అంగడివాడి దగ్గరికి వెళ్ళి, "అప్పు పెట్టి ఒక కాసు బ్రాందీ ఇయ్యి," అని అడిగాడు.

సైనికులకు అప్పు పెట్టననేశాడు అంగడివాడు, నిర్మొహమాటంగా.

యోష్కా వాణ్ణి నానా తిట్లూ తిట్టి, "కావలిస్తే నా కత్తి తాకట్టు పెట్టుకుని బ్రాందీ ఇయ్యి," అన్నాడు.

అంగడివాడా కత్తిని భద్రంగా దాచి పెట్టి, పాత హుజార్లందరికీ తలాకాస్తా బ్రాందీ పోసేసి దుకాణం మూసే వేళ అయిందన్నాడు.

అప్పటికి రాత్రి తొమ్మిది కావస్తున్నది. హుజార్లు అంగడినుంచి బయటికి వచ్చేశారు.

అంతటితో వారి ఆగడం అయిపోలేదు. ఆ సారా దుకాణం అడుగున, ఒక నేల కొట్టులో ఆహారమూ, తాగుడూ దాచి ఉంటాయి. నేలలో ఒక కంత చేసి హుజార్లు కొంతకాలం కిందట ఆ నేల కొట్టును కొల్లగొట్టారు. ఇప్పుడు వాళ్ళా కంతకోసం వెతికి, అందులో రాజును దూరి ఆహారమూ, తాగుడూ తమకు అందించమని ఒత్తిడి చేశారు. రాజుకు తప్పలేదు, వాళ్ళు చెప్పినట్టు చెయ్యక

పోతే చంపేస్తారు. హుజార్లు సాహసానికీ, దుర్మార్గానికీ పెట్టినది పేరు.

నేలకొట్టునుంచి తస్కరించిన తిండీ, తాగుడూ పూర్తిచేసి వాళ్ళు బారకాసులకు బయలుదేరి వెళ్ళారు. బారకాసులకు వాళ్ళు వేళమించి చేరినా గస్తీ సైనికులు వాళ్ళను నిలవేయలేదు.

పాత హుజార్లకందరికీ పడుకునే స్థలాలున్నాయి. రాజుకే లేదు, యోష్కా అనేవాడు నేల మీద ఒక కంబళి పరిచి, రాజును దానిమీద పడుకోమన్నాడు.

రాజుకు నిద్ర పట్టలేదు. అతనికి చాలా కోపంగా ఉంది. ఈ హుజార్లు తన డబ్బంతా తాగెయ్యటమేగాక తన చేత దొంగతనం కూడా చేయించారు. తనను నానా తిట్లూ తిట్టారు. యోష్కాకు గుణపాఠం నేర్పాలని అతను నిశ్చయించుకుని ఒక రాత్రివేళ బారకాసుల నుంచి తన భవనానికి తిరిగి వెళ్ళిపోయాడు.

తెల్లవారుతూనే హుజార్లందరూ తమ ఆయుధాలతో సహా పెరేడు రావాలనీ, రాజుగారు తనిఖీ చేస్తారనీ వార్త వచ్చింది. హుజార్లందరూ తమ ఖడ్గాలను తగిలించుకుంటూంటే, యోష్కా తన కెవరైనా ఒక ఖడ్గం ఇస్తారేమోనని ఎందరినో అడిగి చూశాడు. కాని ఎక్కడా అతనికి ఖడ్గం దొరకలేదు. చివరకతను ఒక వడ్రంగి నడిగి కొయ్యకత్తి ఒకటి చేయించుకుని, దాన్ని ఒరలో పెట్టుకుని పెరేడుకు బయలుదేరాడు.



పెరేడుకు వచ్చి తన ఎదట నిలబడి ఉన్న హుజార్లను యోష్కాను రాజు పోల్చుకుని, అతని వద్ద ఖడ్గం ఉన్నదో లేదో ముందుగా చూశాడు. యోష్కా నడుముకు కత్తి ఒర వేళ్ళాడుతున్నది. అందులో కత్తి లేదన్న సంగతి బయట పెట్టి యోష్కాను శిక్షించాలని రాజు ఉద్దేశం.

ఏదో నేరం చేసినందుకు ఒక సైనికుడికి మరణదండన విధించి, ఖైదులో ఉంచారు. రాజు ఇప్పుడా సైనికుణ్ణి తన దగ్గరకు తీసుకురమ్మన్నాడు. మరణ శిక్ష పొందిన సైనికుణ్ణి తెచ్చారు.

రాజు యోష్కాను ముందుకు రమ్మని, ''వాడి తల నరుకు!'' అని ఆజ్ఞాపించాడు కోపంగా.

యోష్కాకు కాళ్ళు వణికాయి. తన కొయ్యకత్తితో ఆ సైనికుడి తల ఎలా నరకటం? అందుచేత వాడు దీనంగా, ''మహారాజా, రక్తపాతం చెయ్యటం నా కలవాటు లేదు. మరి నాలుగేళ్ళు నన్ను సైనికుడిగా పని చెయ్యమన్నా సంతోషంగా చేస్తాను గాని, దయతలచి ఈ మనిషి తల నరికే పనిమాత్రం నాకు పెట్టకండి.'' అన్నాడు.

రాజు మండిపడి, ''నా ఆజ్ఞ విన్నావా, లేదా?'' అని గర్జించాడు.

''మహారాజా, తమ ఆజ్ఞ నిర్వర్తించే తీరాలంటే నన్ను కాస్త దైవప్రార్థన చేసుకోనివ్వండి,'' అన్నాడు యోష్కా వినయంగా.

రాజు అందుకు సమ్మతించాడు.

యోష్కా పెద్ద నిట్టూర్పు విడిచి, ఆకాశంకేసి చూస్తూ, ''ఓ ఈశ్వరా! ఈ హుజారును కరుణించు, నేనీ సైనికుడి ప్రాణం తియ్యకుండా ఉండగలందులకు నా కత్తిని కొయ్యగా మార్చు!'' అంటూ కత్తిని చప్పున ఒర నుంచి పైకి లాగి, ''చూశారా, మహారాజా! దేవుడు నా ప్రార్థన విన్నాడు!'' అన్నాడు.

రాజు యోష్కా యుక్తికి మెచ్చుకుని, అతన్ని శిక్షించే ఆలోచన మానేశాడు.





# అపకారికి ఉపకారం

## 5

పరదేశి ప్రమాదకరుడైన మాంత్రికుడనీ, అతన్ని కొట్టకుండా అతని నుంచి మేలు పొందడం అరిష్టదాయకం అనీ గ్రామ పెద్దలు, గ్రామస్థులకు చెప్పిన మర్నాడే, సీనయ్య అనేవాడి ఇంట్లో, అతడి భార్య నగలు పోయాయి. ఆమె ఒక గుడ్డలో నగలు పెట్టి, మూటగా కట్టి, చెరువుకు స్నానానికి వెళ్ళింది. తిరిగి వచ్చి చూస్తే, నగలు కనిపించలేదు.

ఈ విషయం తెలిసి పరదేశి, సీనయ్య ఇంటికి వెళ్ళి, వివరాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. తర్వాత ఇల్లంతా కలయతిరిగి, ఒక మూలనున్న కన్నం చూపి, అందులో వెతకమన్నాడు. అది పందికొక్కులు చేసిన కన్నం. సీనయ్య అక్కడ తవ్వి చూడగా, నగలున్న మూట దొరికింది.

ఈ సహాయానికి సీనయ్య, పరదేశిని ఇరవై కొరడాదెబ్బలు కొట్టవలసి వున్నది. కాని, సీనయ్య అలా చేయలేదు. పరదేశిని కొట్టకపోతే, ఎలాంటి అరిష్టం వస్తుందో, చూడాలనుకున్నాడు.

ఆ రాత్రి రహస్యంగా గ్రామ పెద్దలిద్దరూ కలిసి, సీనయ్య పొలంలో, ఒక ధాన్యపు కుప్పకు నిప్పు పెట్టి వచ్చారు. మర్నాడు సీనయ్య లబోదిబోమంటూ, గ్రామ పెద్దల దగ్గిరకు వెళ్ళాడు.

వాళ్ళు, సీనయ్య చెప్పినదంతా విని, "ఇంకేం! నువ్వు పరదేశిని కొట్టకపోవడం వల్లనే, యీ అరిష్టం వచ్చిపడింది," అన్నారు.

ఈ సంగతి, గ్రామంలో అందరికీ తెలిసింది. గ్రామస్థు లందరూ పనిగట్టుకుని,

"వసుంధర"



''మమ్మల్ని భయపెట్టాలని చూస్తు న్నావా? మాకు కలగబోయే నష్టం ఏమిటి?'' అన్నారు పెద్దలు కోపంగా.

''ఈ రోజున, ఒక ధాన్యపుబస్తా. రేపటి నుంచి, రోజు కొక ధాన్యపుకుప్ప. అదీ, మీకు కలగబోయే నష్టం,'' అని పరదేశి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి, నిజంగానే, ఆ పెద్దల ఇండ్ల మధ్య చావడిలో వున్న, ఒక ధాన్యపు బస్తా, హఠాత్తుగా నిప్పంటుకుని కాలి బూడిద అయిపోయింది. విచిత్రమేమి టంటే—ఆ ధాన్యపు బస్తా మంటలు, చుట్టుపక్కల వున్న బస్తాలకు గానీ, యితర సామగ్రికిగానీ సోకలేదు.

ఇది చూసి భయపడిన పెద్దలిద్దరూ, పరదేశి దగ్గిరకుపోయి, ''నువ్వు చెప్పినట్టే జరిగింది! అసలింతకూ, నువ్వెవరివి?'' అని ప్రశ్నించారు.

''నేనెవరినైతేనేం? ఇతరులకు హాని కలిగించను. మీ యిద్దరికీ అధికారమంటే, తగని ఆశ. మీ అధికారానికి, నేనడ్డు రాను. అయితే, నేను యితరులకు సాయం చేస్తుంటే, మీరు నన్నాపకూడదు. మీరు యితరులకు హాని చేయకూడదు,'' అన్నాడు పరదేశి.

''అయితే, మమ్మల్ని, ఏం చేయ మంటావు?'' అని అడిగాడు చిన్నపెద్ద.

పెద్దల ఇళ్ళకు వెళ్ళి, ''సీనయ్యతోపాటు, మేము కూడా ఏవైనా తప్పులు చేసి వుంటే, మమ్మల్ని మన్నించండి! ఇకముందు, అంతా మీరు చెప్పినట్టే చేయగలం,'' అని చెప్పారు.

ఇది విన్న పరదేశి, గ్రామ పెద్దలను కలుసుకుని, ''అయ్యా, యిది చాలా అన్యాయం! మీరే, ఆ సీనయ్య ధాన్యపు కుప్పను తగలబెట్టారని, నాకు తెలుసు. మీరు వెంటనే సీనయ్యకు, అతడు నష్ట పోయిన ధాన్యం, యిచ్చెయ్యండి. మీరు అలా చేయకపోతే, అంతకు మించిన నష్టం, మీకు కలుగుతుంది,'' అని హెచ్చరించాడు.

"మీరు సీనయ్యే దగ్గిరకు వెళ్ళి, నన్ను యిరవై కొరడాదెబ్బలు కొట్టమనండి. ఈలోగా, అతడి ధాన్యపుకుప్పలో బూడిదైన ధాన్యం ఎంత వుంటుందో, అంతా అతడి పొలంలో పోయించండి. ఇదంతా రహస్యంగా జరిగిపోవాలి. ఇలా చేయడం వల్ల, సీనయ్యకు జరిగిన నష్టం తీరిపోతుంది. గ్రామ పెద్దలుగా, మీకు పేరూ వస్తుంది," అని సలహా యిచ్చాడు పరదేశి.

పెద్దలిద్దరూ పరదేశి చెప్పినట్టే చేశారు. పరదేశి ఇరవై కొరడాదెబ్బలు తిన్నాడు. ఆ రాత్రి, పెద్దలిద్దరూ రహస్యంగా కొన్ని ధాన్యం బస్తాలు బండి మీద వేసుకుపోయి, సీనయ్య పొలంలో వేసి వచ్చారు.

మర్నాడు, జరిగింది తెలిసి, గ్రామంలో అందరూ విడ్డూరంగా చెప్పుకున్నారు. పరదేశి ఎవరో, గ్రామంలో అందరికీ ఎందుకు సాయపడుతున్నాడో, దెబ్బలు తింటూ కూడా, ఆ గ్రామంలోనే ఎందుకుండాలనుకుంటున్నాడో—ఎవరికీ అర్థం కాలేదు. కాని, గ్రామ పెద్దల పలుకుబడీ, వాళ్ళ మీద గ్రామస్థుల నమ్మకం మరింతగా పెరిగాయి.

ఇక, జయవిజయు లిద్దరూ, పరదేశిని గురించి మొదట్లో అంతగా పట్టించుకోలేదు. తల్లిదండ్రులు, వాళ్ళను, "మీరా



పరదేశి జోలికి పోకండి. వాడు చాలా ప్రమాదకారి!" అని చాలాసార్లు హెచ్చరించారు.

ఒక రోజున, నది ఒడ్డున జయవిజయులిద్దరూ, అక్కడికి బిందెతో నీళ్ళకోసం వచ్చిన, ఒక అమ్మాయిని ఎగతాళి చేస్తూ ఆటపట్టిస్తున్నారు.

ఇద్దరూ కలిసి, ఆ అమ్మాయి నుంచి బిందె లాక్కుని, "ఆ కనబడే మామిడి చెట్టెక్కి, మా ఇద్దరికీ చెరో నాలుగు మామిడిపళ్ళు కోసిస్తే, నీ బిందె తిరిగి యిస్తాం. అలా చేయకపోయావో, నీ బిందెను నదిలో పారవేయడమే కాక, నిన్నిక్కణ్ణుంచి వెళ్ళనివ్వం!" అన్నారు.



అ అమ్మాయికి, ఏం చేయాలో తోచక, బిక్కమొహం వేసుకుని నిలబడింది. అంతలో, ఆ దారిన పరదేశి వచ్చి, జరిగింది, ఆ అమ్మాయిని అడిగి తెలుసుకుని, జయవిజయులతో, "మీకాక్కవలసింది, చెట్టెక్కి మామిడిపళ్ళు కోయడమే గదా ? నేనా పని చేస్తాను. ఈ అమ్మాయికి బిందె యిచ్చెయ్యండి," అన్నాడు.

"ముందు పళ్ళు కోసివ్వు: అలాగే వదిలేస్తాం," అన్నాడు జయుడు.

అసలు సంగతేమంటే—అది మామిడిపళ్ళ ఋతువు కాదు. చెట్టున ఒక్క పండయినా లేదు. అందువల్ల, పళ్ళు కోసివ్వడం, పరదేశివల్ల కాదనుకున్నారు వాళ్ళు. కాని, పరదేశి చెట్టెక్కి, ఎనిమిది మామిడిపళ్ళు కోసి, వాళ్ళకిచ్చాడు !

జయవిజయు లిద్దరూ తెల్లబోయి, "కాలం కానికాలంలో, చెట్టెక్కి పళ్ళెలా కోశావు ?" అని అడిగారు.

"ఏమాత్రం స్వార్థం లేకుండా, యితరులకు సాయం చేయాలనుకుంటే, ఏ చెట్టునడిగినా పళ్ళిస్తుంది; ఏ గుట్టనడిగినా మణులిస్తుంది," అన్నాడు పరదేశి.

"అయితే, ఏ గుట్టనయినా అడిగి, మాకు మణులు తెచ్చిపెట్టు," అన్నాడు విజయుడు.

"ఇచ్చిన పళ్ళు చాలు. మణులేం యివ్వను. ముందా అమ్మాయిని వెళ్ళనివ్వండి," అన్నాడు పరదేశి.

జయవిజయులు అందుకు ఒప్పుకోక, మొండికెత్తారు.

అప్పుడు పరదేశి, ఆ అమ్మాయితో, "వాళ్ళు, నిన్నేమీ చెయ్యలేరు. నీ బిందె తీసుకుని, వెళ్ళిపోమ్మా !" అన్నాడు.

ఆ అమ్మాయి వెంటనే బిందె తీసుకుని బయలుదేరింది. ఆమెను ఆపాలని జయవిజయు లిద్దరూ అనుకున్నారు. కాని, వాళ్ళకు కాళ్ళూ చేతులు కదల్లేదు. ఆమె, కనుచూపు దాటిపోయిన తర్వాతే, వాళ్ళకు కాళ్ళూ చేతులు స్వాధీనంలోకి వచ్చినై. నోరువిప్పి మాట్లాడగలిగారు.

''నువ్వు మాంత్రికుడివా ?'' అని అడిగాడు జయుడు, పరదేశిని.

''నాకు తెలిసిన మంత్రం ఒక్కటే— అదే మంచితనం!'' అన్నాడు పరదేశి.

''మా సరదాకు అడ్డువచ్చావు. నువ్వేం మంచివాడివి,'' అన్నాడు విజయుడు.

''ఇతరులను బాధించనంతవరకూ, మీ సరదాలకు నేనడ్డురాను. ఇకమీదట మీరెప్పుడైనా, ఇతరులను బాధించాలనుకుంటేమాత్రం, మీ కాళ్ళూ చేతులు కదలవు; నోరు మెదలదు. బాగా గుర్తుంచుకోండి!'' అని పరదేశి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత జయవిజయులకు, పరదేశి చెప్పినట్టే జరిగింది. వాళ్లు, గ్రామస్థులను బాధించడం, తగ్గిపోయింది. తమ సరదాలకు పరదేశి అడ్డుతగులుతున్నాడని, వాళ్ళు తండ్రులకు చెప్పుకున్నారు. అయినా, ఆ పెద్దలు, యీ విషయం అంతగా పట్టించుకోలేదు. జయవిజయులు దుర్మార్గకార్యాలుచేయకపోతే, గ్రామస్థులు తమనింకా ఎక్కువగా గౌరవిస్తారని, భావించారు.

ఈ విధంగా జయవిజయులకు, పరదేశి అంటే ద్వేషం ప్రారంభమైంది. వాళ్ళొకసారి, పరదేశి నిద్రపోతున్నప్పుడు తాళ్లతో బంధించి, నీటిలో పారవేయాలనుకున్నారు. అయితే, వాళ్ళు తాళ్ళు తీసుకుని పరదేశి ఇంట్లోకి వెళ్ళేసరికి, అవి వాళ్ళనే బంధించివేశాయి. వాళ్ళు కదల్లేక మూలుగుతూంటే, నిద్రపోతున్న పరదేశికి మెలుకువ వచ్చింది.

ఆయన, వాళ్ళ బాధ చూసి జాలిపడి, తనే వాళ్ళ కట్లు విప్పి, ''నన్ను మోసంతో ఎవరు బాధించాలనుకున్నా, అలాంటి హింసకు వాళ్ళే గురవుతారు. నేను ఒప్పుకుంటే తప్ప, నన్నెవరూ బాధించలేరు,'' అని చెప్పాడు.

జయవిజయులు, అప్పటికేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయారు. కాని, వాళ్ళలో పరదేశిని హతమార్చాలన్న పట్టుదల ఎక్కువయింది. —(ఇంకావుంది)





# పంచాంగశాస్త్రి

అనగాననగా ఒక అడవి. ఆ అడవిలో ఏడుగురు దొంగ లుండేవారు. ఒక రోజున వాళ్ళు దొంగతనానికని బయల్దేరి వస్తుండగా పంచాంగశాస్త్రి ఎదురుపడ్డాడు. నున్నటి బోడిగుండు, గుండు మీద పంకాయముచ్చికంత పిలక, వొంటినిండా విభూతి రేఖలు, చంకని విసినికర్ర, చేతిలో పంచాంగం—ఇదీ శాస్త్రుల్లు వేషం.

శాస్త్రి వేషం చూసి దొంగలు నవ్వారు. వాళ్ళని ఎగాదిగా చూసి, వాళ్ళు ఫలానా వారు కదా అని శాస్త్రి తెలుసుకున్నాడు. అయన ఇప్పుడు దొంగల చేతుల్లో చిక్కుకున్నాడు. వాళ్లు పిలక ఊడగొట్టి చేతిలో చెంబూ, భుజం మీది అంగవస్త్రం లాక్కున్నా తను చేసేది ఏమీ లేదు.

ఇటువంటి సమయంలో శాస్త్రికి మంచి ఉపాయం తట్టింది. దొంగల్ని దగ్గిరికి పిలిచి ''వోయి అబ్బాయిలూ! ఇలా, వేళాపాళా వేకుండా మీ యిష్టం వచ్చినప్పుడల్లా దొంగతనానికి బయల్దేరితే లాభం లేదు. నేను పంచాంగం చూసి, మంచి ముహూర్తం పెట్టుతూ వుంటాను. నేను చెప్పినట్టుగా చేశారంటే, మీరు పట్టుపడరు. పైగా కోరినంత ధనం దొరుకుతుంది. మీరు హాయిగా కాలక్షేపం చెయ్యొచ్చు.'' అని వాళ్ళకి సలహా ఇచ్చాడు.

ఈ మాటలు వినగానే వాళ్ళకి వొళ్ళు పరవశమైపోయింది. ''అంతకంటేనా బాబయ్యా! మీరు చెప్పినట్టే నడుచుకుంటాం. తప్పకుండా పంచాంగం చూసి వెంటనే మంచి లగ్నం పెట్టండి.'' అన్నారు అందరూ.

ఆనాటి నుంచీ పంచాంగశాస్త్రి ముహూర్తం పెట్టుతూ ఉండేవాడు. ఆ ప్రకారమే దొంగలు కన్నాలు వేస్తూ చాలా



ధనం సంపాదించుకుంటున్నారు. వాళ్లు తమకు దొరికిన ధనంలోనించి పంచాంగ శాస్త్రికి పదేసి వరహాలు గురుకట్నం ఇస్తూ వుండటం కూడా మామూలయింది. కట్నం ఇవ్వటమే కాకుండా, దొంగలు ఆయన్ని ఎక్కువగా గౌరవిస్తున్నారు.

కొన్నాళ్ళయ్యేసరికి, పంచాంగశాస్త్రికి దుర్బుద్ధి పుట్టింది—"మనకి వాళ్ళిచ్చే కట్నం ఏ మూల కొస్తుంది? ఇంతకంటే మనం వాళ్ళతో చేరిపోయి వాటా పుచ్చుకొన్నట్టయితే ఎక్కువ వస్తుంది. కొద్ది రోజుల సంపాదనతో చక్కగా కొడుకు పెళ్ళి చేసుకోవచ్చు," అని అనుకున్నాడు. ఈ ఉద్దేశం దొంగలకు చెప్పి, "నేనూ మీతో వస్తాను, నన్ను కలుపుకొని వాటా ఇవ్వండి," అని కోరాడు.

"ఎంతమాట అన్నారు బాబయ్యా! మీరీ కష్టాలు పడలేరు. కావాలంటే ఒక వెయ్యివరహాలు తెచ్చి యిచ్చుకొంటాము. అబ్బాయిగారికి వైభవంగా పెళ్ళి జరిపించండి," అని దొంగలు చెప్పారు.

వెంటనే శాస్త్రి పంచాంగం చూసి, చిరునవ్వుతో, "రేపు ఏకాదశి తిథి బాగా వుంది. ఈ తడవ ఉత్తర దిశకు వెళ్ళితే మంచి లాభం కలుగుతుంది. తప్పకుండా బయల్దేరండి. నేనూ మీతో వస్తా"నన్నాడు, వాళ్ళతో.

"మీకు ఎందుకొచ్చినపాట్లు బాబూ! మీరు రావద్దు. మీకావలసిన ధనం యావత్తూ చేతులు కట్టుకు పట్టుకొచ్చి మీ పాదాల ముందు పెడతాము," అని అనేక విధాల బతిమలాడారు దొంగలు. అయినా, ఆ మాటలు ఎంతమాత్రం వినక, శాస్త్రుల్లు కూడా వాళ్ళ వెంట ప్రయాణమయ్యాడు.

సరే, అనుకొన్న ప్రకారం మర్నాడు రాత్రి వెన్నెట్లో, శాస్త్రితో సహా ఎనిమిది మందీ ఉత్తరదిశకు బయల్దేరారు. ఒక వూరు చేరుకుని, ఆ గ్రామంలో ధనవంతుడైనటువంటి రంగయ్యగారింట చొరబడ్డారు.

అవేళ ఏకాదశి. రంగయ్యగా రింట్లో అందరూ ఉపవాస మున్నారు. మర్నాడు ద్వాదశీ పారాయణ. తెల్లవారుజామునే వంటలు చేయటానికని కూరలూ అవీ తరిగేసి, పప్పులూ ఉప్పులూ సిద్ధం ఛేసుకుని పడుకున్నారు. దొంగలు ఇల్లంతా గాలించి పదివేలు విలువ చేసే వస్తువాహనాలు, బోలెడంత రొక్కం లంకించుకున్నారు.

ఇంకా ఏమైనా దొరుకుతుందేమోనని వంటింటి వద్దకు వచ్చారు. తీరా చూస్తే వంటింట్లో మన పంచాంగశాస్త్రి మడి కట్టుకుని, వంట చేస్తున్నాడు. వాళ్ళను చూడగానే, ''మడి తగలడిపోతుంది. లోపలికి రావద్దర్రా,'' అని వాళ్ళకి సంజ్ఞచేశాడు.

''అయ్యో బాబో! మనమింక ఇక్కడ ఉండకూడదు. చాలా ప్రమాదం. పోదాం రావయ్యా,'' అని దొంగలు ఎంతగానో బతిమాలారు.

''అదేమిటల్లా తొందరపడతారు! చిటికలో వంటయిపోతూంది. భోంచేసి పోదాం, వుండండి,'' అని అంటూ మన శాస్త్రి విస్తరాకులు వెదకసాగాడు.

సావిట్లోకి పోయేసరికి, దేవుడి మందిరం కంటబడింది. ''ఇంతా చేసి, దేవుడికి నివేదన చేయకుండా భోజన మేమిటి? పాపం కూడా చుట్టుకుంటుంది,'' అనుకున్నాడు శాస్త్రి. యథావిధిగా దేవతార్చన ప్రారంభించి, గణగణ గంట మోగించేసరికి, ఒక్కమాటు ఇంట్లోవాళ్ళందరూ గభీమని లేచారు.

అందరినీ పంచాంగశాస్త్రి కంగారుతో చూస్తున్నాడు. ''నువ్వెవరవు?'' అని రంగయ్యగారు అడిగేసరికి, తమ వచ్చిన సందర్భం యావత్తూ పూస గుచ్చినట్టు చెప్పేశాడు, శాస్త్రి. ''వోయి పిచ్చి బ్రాహ్మడా! ఎంత పని చేశావు?'' అని రంగయ్యగారు శాస్త్రిని జాలిదలిచి, పది వరహా లిచ్చి పంపాడు. పారిపోవటానికి వీల్లేక దొంగలు పట్టుబడిపోయారు. వాళ్లని జైల్లో వేశారు. దాంతో మన పంచాంగ శాస్త్రికీ, దొంగలకీ జట్టు విడిపోయింది.



## రుచికర ఆహారం!



సముద్రంలో నివసించే బర్రాకుడా చాలా ప్రమాదకరమైన జలచరం. అయితే ఇది, చిన్న చిన్న పురుగులను, తన బలమైన పెద్ద పళ్ళ మధ్య జొరబడి అక్కడి బాక్టీరియాను పట్టి తినడానికి అనుమతిస్తుంది.

## వడ్రంగిపిట్ట

వడ్రంగిపిట్టకు, కొక్కెం గల పొడవైన నాలుక ఉన్నది. తలలో దృఢమైన ఎముకలూ, సాగే కండరాలూ మధ్య, ఈ నాలుక చుట్టగా చుట్టుకుని ఉంటుంది. కావాలన్నప్పుడు వడ్రంగి పిట్ట, నాలుకను వేగంగా బయటకు సాచి పురుగులను పట్టుకుంటుంది.



## పీత కాని పీత!



గుర్రపునాడా పీత (హార్స్‌షూ క్రాబ్) అని పిలువబడే పీత, నిజానికి పీత జాతికి చెందినది కాదు. ఇది దాదాపు 370 మిలియన్ల సంవత్సరాలకు పూర్వం అభివృద్ధి చెందిన తేలు జాతికి చెందిన ఒక జంతువు।

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1987 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



V. Rajamani



B. C. Ravichandar

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: వ్యవహారజ్ఞాన బోధన! రెండవ ఫోటో: వ్యాయామ సాధన!

పంపినవారు: ఆర్. రాధాకుమారి, అభిరామపురం, మద్రాసు–18

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---